# శశిరేఖాపరిణయనాటకం

ఇది,

పండితులచే బరిష్కరింపఁబడి



శ్రీ వరదరాజులు మొదలియారు గారిచే

శ్రీ రంగవిలాస ముద్రాక్షరశాలయందు

శ్రీరామజయం.

శ్రీరామకృష్ణ పరబ్రహ్మణేనమః.

మ ట్టి గుం ట

# శశిరేఖాపరిణయనాటకం

ఇది,

పండితులచే పరిష్కరింపఁబడి,






చెన్నపురి పుస్తకవ్యాపారులగు

కో. లక్ష్మణమొదలియారు కొమారుడు

కో వరదరాజులు మొదలియారు వారి

స్వకీయ

శ్రీ రంగవిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రచురింపఁబడియె.

దీనివెల] 1933 [0-4-0



శ్రీరామజయం.

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః



# మట్టిగుంట శశిరేఖాపరిణయ నాటకము

## ప్రారంభము.

---

క. శ్రీ గోపాలశిరోమణి।
సాగరవరతనయవినుత జలరుహచరణా।
బాగొప్ప మట్టిగుంటను।
భోగమునొందింపుమన్న భుజగశయనా॥

దరువు - ఆదితాళము - శంకరాభరణము.

శ్రీరామా నిను గొలచెదనూ చేరి పదాంబ్రములు గలచెదనూ ॥ శ్రీరా। మారజనక సమ్మోద మెదనూ॥ రక్షేసి బ్రోచెదమనూ॥ శ్రీ॥ ముందు నీనామంబు జనాలందరికి ఘనుచు నమ్మితి నా। డెందమందు నిలచితివైనా। సందియమిడచియు దలచెదనా॥ శ్రీరా॥ శ్రీకాంతాలింగా హ్వాయుని। చేరి బ్రోచుచు సౌఖ్యమని। యీ భువిమట్టిగుంట పురిని। వెలసితి చిర ప్రఖ్యాతిగ॥ శ్రీరా॥

గణపతిప్రార్థన.

క. శ్రీగౌరి గంగనందన।
నాగానన సర్వవిఘ్ననాయక నీకున్।

సాగిలి మ్రొక్కెద నిరతము।
బాగుగసత్కృపనుజూడు భవహర నేడుఁ॥



దరువు - ఆదితాళము.

గణనాధ నను బ్రోవవే। బ్రోవవే వేగ॥ గణ॥ ఫణిరాజభూషా। భక్తసుపోషా। యణుమాత్ర మెడ బాయక। పాయకముక్తిదాయక॥ గణ॥ గజముఖ నిన్నూ।సుజనులు మున్నూ।భజియించియశమొందిరి। మొందిరీ కీర్తిజెందిరీ॥ గణ। ఆదిమూర్తినిను।వేదమూర్తివని।నీదు కీర్తనములూ। నమలూమాకములూ॥ గణ॥ నీకృపజెందూ।మీకృతియందూ।ప్రాకృతమెడబాపరా। బాపరాదాపురారా॥ గణ॥ ఓయేకదంతము।కుంటి తనయ వటగుంటనివాసుడవే। వాసుడవీవుకావే॥ గణ॥

సరస్వతి ప్రార్థన.

క. పరమేష్ఠిరాణి నిన్నును।
నిరతము ధ్యానించుచుందు నేర్పుజెలంగఁ।
పరిపూర్ణ కరుణతోడఁ।
స్థిరముగ నీకృతికిమేలుచేయుముచ ర్గఁ

## మట్టిగుంట శశిరేఖాపరిణయ నాటకము

### దరువు-ఆది తాళము-నాదనామక్రియ రాగము



అజనిరాణి రావే। మమ్ము బ్రోవావే॥ అజ॥ భజియించెద మది నిజముగ పదపర । నిజముల నెప్పుడు సన్నుతింపుచును॥ అజ॥ పలుకులు నమృతము । లొలుకగ నెప్పుడు । తలవాకిటను॥ మెలగెదు పొలతి॥అజ॥ మరువక వేడెద। మట్టిగుంటపురి। వరదుని కోడల వందన మిదుగో॥ అజ॥

వ. తదనంతరంబా॥

సీ. శ్రీరమానాథుని శేషశాయినిమాల్యశిఖరి వాసుడు నారసింహుపాద, సారసంబుల సేవ సద్భక్తితో జేసి శారద గణపతుల సన్నుతించి, కవిశ్రేష్ఠులగు వ్యాస కాళిదాసాది సత్కవులను గొనియాడి ఘనత గాంచి సాదరంబున నాదు సద్గురుగాయక వంశక్షీరవార్థిసోము, పెద్దయా హ్వాయు పదములు ప్రస్తుతించి, ఆర్యసుజనుల సందరి నభినుతించి, నరయు శశిరేఖ పరిణయ నాటకంబు చెప్పెదనుతప్పు గాచుదిద్దు శ్రేష్ఠులారా.

వ. అనియిష్ట దేవతా ప్రార్థనంబు గావించి కృతిని జెప్పిం దినబొంతాలింగప్పనాయుని వంశక్రమం బెరింగించెద.

ద్వి. శ్రీమించుభువిలోన చెన్నొందమరియు - కామితార్థంబులు గల్గుచున్నట్టి ధరణిదేవికి ముఖదర్పణంబనగ - పురములో మేటి పురమన బరగు - గురుతరంబుగ మట్టిగుంటపట్టణము - నిరతధనధాన్యము ల్నిండిన పురము - ఆ పురంబునకు తూర్పు నతిరమ్యముగను - దీపింప కృష్ణా నదీయన

బరగి-నల్లవాగిరుగడలనాకుతోటలునుకినల్లలితంబై నసహకారములును,
తరుచైనవనములు తరుచైనపైరు-లరయనసాధ్యమా నటదక్షిణమున
చెరువులుబావులు చెఱకుతోటలును-పరగపైరులపంట బలియమాదిశ
ను-పడమరదిశయందు పాలసాగరము-వ · పున ఘనమైన వరతటాకం
బు-బలమైనకానసముల్ బహునీరుకోళ్లు-పలువిధ వనపుష్ప ఫలముల
పెంపు-దలపఁసాధ్య మీధాత్రిలోపలను-ఉత్తరదిశయందు నొనరమ్మ
న్నదిన-యుత్తముల్ స్నానంబు లొనరింతురెపుడు-ఇటువంటివైభవం బె
నసియున్నట్టి-పుటభేతనం బెన్న బుధులకువశమె-ఆ పురిభూసురోత్తము
లు వేదాంతు-లాపురినృపులు సాహస గుణధైర్యు - లాపురి వైశ్యులు
నమిత శ్రీమంతు-లాపురి శూద్రులు హరిభక్తియుతులు-మరియు పురు
షుల నెన్న మన్మథసములు - సరవిపార్వతి లక్ష్మి సరియైన స్త్రీలు-భా
గ్య భోగంబులకు బలభేదిపురికి - యోగ్యతగను సరివచ్చు నరయగను
నేటయిన యాపురి నివసించుగాక-నాటికాపులు యశము నమరినవారు
వారిలోపల కీర్తివంతుండు గలడు-వారకబాంతానువంశవర్ధనుడు-కోరిక
ముత్యాల గోత్ర సంభవుడు-నారసింహయను నాయు డధికుండు-
పడతిని తిరుమలాంబనువరియించి - బడసెనిద్దరినుతులపటుభుజబలుల-
కగ్రజు డగులింగయాఖ్యుసనుజండు-నిగ్రహపరుడైన నీతికోవిదుడు -
పేదపనాయుడు పేరుగలదాత-ధారుణిపేదల దయతోడబ్రోచు-ఆయన
పిచ్చమాంబను వరియించి-బాయకసంతోషభరితుడై యున్న-క్షీరాబ్ధి
లోశశి జన్మించినట్లు-కోరికమీరంగ కోమలిపిచ్చ-మాంబ గర్భంబున
మన్మధసముడు-సంభవమాయెను సరసులు బుధులు-నరవరుల్ లింగప
నాయుడుయనద-సరవితోనుదయించి సంతోషుడగుచు - అనుజుండు
కొండయయనునాయుడెలమి-ఘనముగగల్గిన కడు సంభ్రమునను-శంఖ
మవీడివంశాబ్ధిచంద్రుండు-పాంకమాహరిశ్చంద్రుబోలినఘనుడు-గురవ
యాహ్వయుడమిత గుణవిశారదుని-వరపుత్రియగు పతివ్రతయనదగిన
కామలక్ష్మాంబయను రమణినిచాల-ప్రేమతోవరియించి పేరువహించి
యిటువలెలింగాఖ్యు డెలమినొకనాడు-పటుతరస్నానంబు బాగుగాచేసి
మంచిసుగంధముల్ మైనిండబూసి-పంచబాణుండని ప్రజలెన్నుచుండ-

సరిగెవస్త్రములెల్ల సవరించికట్టి-కరములమణులతో కడియముల్ వ్రేళ్ళ విరదుంగ్రములుదాల్చి పెంపునింపెనగ-మరువక హరిభక్తి మదినెన్ను కొనుచు-కంఠమున ధరియించె ఘనభూషణములు-కంఠీలు మొదలయిన కాంతిసొమ్ములును_సందిటబంతులు సరసతాయతులు-పొందుగా ధరియించి భోజనముచేసి-యిష్టరుచిపక్వాను లేవెల్ల భుజించి-శ్రేష్టవర్యులతోటి చెలువొప్పగూడి-వడిగ తాంబూల ము[illegible]తలందియ్య-విడెము బు జేయుచు యిరుప్రక్కలందు-పండితగాయక భట్టకవీంద్రు-లుండి కై వారంబు లొప్పగా జేయు-బంధువులు భయపాన్యముల వంప-యెందా జూచిన వేళ్య లింపొం[illegible]యాడ-నారూఢి సింహాసనాసీనుడగుచు-భారత గ్రంథంబు భాగవతంబు-చదివించి వినుచుండి సంతోషుడగుచు-మది లోన శశిరేఖ పరిణయం బవుడు శృంగార నాటకము జేయింపతలచి-పొంగుచు సంతోష [illegible]ర్లుడైతాను,

కందార్థం॥ ఘనుడగు లింగమనాయుడు। పనివడి పిలిపించినన్ను బహుసంతోషం। బున గాంచి కరుణతోడను। ఘనగగ యీ నాటకంబు త్వరితముగా॥ జెప్పూ శశిరేఖా॥ చరితమూ॥ గురుతుగ శ్రీమట్టిగుంట పురి। వరదుస్సైకృతి సరవితో విల్పియు। త్వరితమూ॥

వ. ఇట్లానతిచ్చిన నాయునంబున సంతసించి యిష్టదేవంబులకొని యాడి మద్గురువులకు వందనంబు లాచరించి బుధవర్యుల సేవించి శ్రీమ ద్వంశ వర్ణనం బెరింగించెదా.

ద్వి. శ్రీకర పెద్ద లాశీర్వాద మొసగ-మాకులవర్ణన మనవి చేసె దను, కూరిమి పంచమకుల వైష్ణవుడను, కోరిక రేచర్ల గోత్రమందునను శ్రీగోత్రముచ్చు వంశేంద్రుడరంగాఖ్యు, వేగ రామానుజయతివరుగొలిచి భాగవతపోషణ పరుడు దీక్షితుడు, బాగొప్పవరియించె పడతినాంచారు, వరగర్భమునపుట్టి వసుధలోపలను, నరసాఖ్యదాసుని ననుజుండనంచు, ధర నెన్నసబ్బయ దాసుడయేను, ధరణిలోసత్కీర్తి దనరశశిరేఖ, పరి ణయనాటకము ప్రణుతించితిపుడు, కరమర్థిపెద్దలు ఘనులైనవారు, తప్పు లుదిద్దుడి దయతోడమీర, లిప్పుడు బుధవర్యు లేవెదుకమీర

శ్లో. శ్రీమదబ్ధిపూర్ణచంద్రమ్। నృసింహార్యకృపాపాత్రమ్। అపాఘరినిజపదమ్। జంగ దేశిక పాహిమామ్॥

కథా ప్రారంభము.

ఉ. శ్రీకరవైభవోన్నతుడు సింధురవైరి సమానధైర్యుడా।
నాకపురంబుసాటి యగు నారసిద్వారక నేలునట్టి యా।
భీకరశీరపాణి బలుప్రేమతో గొల్వన గొల్చుచుండగా।
రాకను గాంచి ద్వారకుడు రచ్చకుముందుగవచ్చె దీరతా॥



దరువు - ఆది - ఆరభి.

ద్వారపాలు డరుదెంచెగా। హోయల్లను॥ ద్వా॥ ధారుణిచోరులు తత్తరమందగ। గోరమీసమొడి మీరదీయుచును॥ ద్వార॥ శిరమున పాగాజుట్టిబల్। సరిగెవస్త్రముల్ గట్టి। కరములబంగారు కడియాలుధరియించరువగు ముత్యాలు। సరములువేసుక॥ ద్వా॥ పదునగుఖడ్గముబూని। సరిబంటెవ్వారయనుకొని। మది నెమ్మచుశ్రీమట్టిగుంటజను। లిదు గోచూడుడని వేడుక పడగను॥ ద్వా॥

సీ. శ్రీకరంబైన యీక్షితిలోన జెన్నొందు అమరేంద్రపురికంటె నధికవిభవ మగునట్టిద్వారక నగరంబునేలెడుబలరామమూర్తి బల్ విలసితముగ, సింహాసనమున వివసించుటకొరకున్నై వేంచేయుచున్నాడు వే

డుకలర, రచ్చకొట్టంబులు రాజమార్గంబులు పచ్చతోరణములు బాగ
గట్టి ముత్యములు తెచ్చిసొగసుగాముగ్గుదీర్చి, పూలపందిళ్లుగావించిపొంక
మైన గంధజవ్వాజియుత్తరుగల్పి, జాగ్రతగనిప్పుడుండుడి జనములారా,

క. ఇట్లుచెప్పుచున్న బలరామమూర్తి కొలువుకు వచ్చుట.

బల - దరువు - కన్నడ

నీలాంబరుడూ వచ్చెనూ। కొల్వుచేరగనూ॥ నీలా॥ చాలవంది
భటకవులు పొగడభూ। పాలశిఖామణిమేల్ సంతసమున॥ నీ॥ ద్వారక
పురవర ధీరుడు తనపరి। చారులువడి జనుదేరగ హాయలుగ॥ నీ॥
భేరీమృదంగాల్ భోరునమ్రోయుగ। ధారుణిధవు డతిధైర్యశౌర్యమున॥
నీ॥ సంతసమలరగ బాంతాలింగయను। చెంతబ్రోచుశ్రీశౌరికగ్రజుడు॥
నీలాంబరుడు॥

ద్వి. వినగోరిద్వారక వివరంబుగాను, మనపట్టణంబున మహీను
రోత్తములు-వేదమాదిపురాణ విధులయినవారె, ఆదిహిమాంశవంశజు
లయిననృపులు, కదనజయము జెందిఘనత గాంచెదరు, పదపడిద్రవ్యాధి
పతులెవైశ్యులను హరిభక్తిమరువని యధికులవృశూద్ర, వగులాది జ
నములు వనరశుభంబె, సంగీతవిద్యాప్రసంగంబులెల్ల, సంగతిమీరంగ
జరిపెడివారు, వదలకసంతోష వార్ధిదేలెదరె, సదయము ఫలవృక్ష
చయములువృద్ధి, గలిగియున్నవిగదా గరిమధర్మంబు, చెలువొప్పనడ
చునే నాల్గుపాదముల, చప్పన్నదేశరా జన్యులుమనకు, తెప్పన కాను
కల్ దెచ్చుచున్నారె, శ్రీ మట్టిగుంటపురీశునికృపను, కాంక్షితసౌఖ్యము
ల్ గలవారె జనులూ॥

వ ఇదియునుంగాక మనహాజారంబున సకలసామంత కవిగాయ
క పాఠక విద్వజ్జనంబులు హాజరైయున్నారా ఇప్పుడు నీవతి వేగంబున
జని నాయొక్క ధర్మపత్నియైన రేవతిని బిలుచుకొనిరమ్మా, అంత రేవ
తివచ్చు విధం బెట్లనిన,

రేవతి॥ సీ. వినవమ్మనాయొక్క వృత్తాంతమెల్లను చంద్రవంశం
బున జననమైన వసుదేవుమామామ వనితరోహిణియుత్త మరది శ్రీకృ
ష్ణుండుమండయాన, రమణీయమైనట్టి రథగజాశ్వంబులు విమలంబుగా

మంచి విభవముమరి. పురుహూతునగరుకు బోల్పందగినయట్టి పరగ శ్రీ ద్వారకాపురముమాది, రైవతుడునాదు జనకుండు రసికుడమ్మా, తల్లి పద్మావతీదేవి ధరణిమట్టిగుంటపురమున వెలయువైకుంఠుకృపను. అర యరేవతి యని జనులంద్రు నన్ను॥

రేవ–దరువు–ఆది–శంకరాభరణము.

అందామూమీర వెడలెనపుడూ॥ రేవతీదేవీ॥ అం॥ కు దరద నపూర్ణేందునిభానన। డెందమందు విభునందుభక్తిగనూ॥ అం॥ మద నూనిచేతి శరమిదియనగా। తనదాసీస్త్రీలు పొదగివెంబడియునడచిరా గా। మదికింపగుసొమ్ములు ధరియించుచు। కురురగుమధ్యముగునిపియూ డగను॥ అం॥ ఇంతీ మాణిక్యముల దొంతీ। మగునిచేపూలబంతీ మెరు వులకు సరిమైకాంతి। బొంతావాంశసద్భూషణములింగా। ఖ్యాంతరంగమంద మరిన హరికృప। నందా॥

వ. ఇట్లరుదెంది ప్రాణేశునిం గాంచి,

రే–క. దండముజీవేశ్వరవర, దండమయా మేరుధీర ధర్మవిచారా
దండముభూమండలధవ, దండిగసత్కరుణజూడుదయతో నేడూ

బ–క. వర్ధిల్లవె మత్కులసతి, వర్ధిల్లవె నీలవేణి వరపూబోణీ
వర్ధిల్లవె రేవతినీ। వర్ధిల్లవె కమలనేత్రి వరచారిత్రీ.

వ. ఇట్లున్నసమయంబున బలరామమూర్తి చెల్లెలు అగు సుభ ద్రాదేవి వచ్చెనట యెటువలెను

సు–ద్వి. శ్రీరమ్యమైనట్టి శృంగారగాత్రి–గారవమగుమృదు కం జాతనేత్రి–హాలధరుసోదరి యయినసుభద్ర–చెలువొందపన్నీట జలకం బులాడి–ఘనమైన మల్లెమొగ్గల సీరగట్టి–పనితనమైనట్టి పట్టురవికెయును దొడగినవరత్నాలతో చెక్కినట్టి–కడురమ్యమైనట్టి కాంతిసొమ్ములును– బరువడిసంతోష భరితయయి బెట్టి–గురుతురన్యగ్రోధ గుంటపురిహరిని మరువక తలచుచు మదిరాజీవచ్చె.

దరువు–ఆది–స్త్రీరాగము

వెడలె సుభద్రదేవియూ॥ వెడ॥ వెడలెమరశ మిడునడుగుల వడువున। నడుగులిడుచువేట్క పడతులమెడలను। నిడుకొని కరములు

తడయక వడిముడమలరఁగ। నడుమున దగుపిడికిటయని నుడువగ।బిడా
జనుతుపదతుక కడుహాయలుగ॥ చ॥ మదిరాక్షి నుదురీక్షింపగ శశి
నపలించి। కుదురగ ప్రతి మని ముదితలు మనమున। మగనుని పదునగు
శాణమా యనగను చెడలునడివిజులు చెదరక మదిసంతసములు। మొద
వగనతి సమ్మదమది మొగలో। కుదురుపరచి కువలయాక్షిభింబిర॥ చెడ॥
విరిబోణీ దర్వీకరమునకును సరివేణీ పరమసాధ్వీ వరు।చరణ స్మరణ
మదిమరువని నిశ్చయమనిశము గల్గియు। ధరలోపలబలు నరవరులరు
దందగ మేలు గరిమబొంత లింగమనాయుని। ద్వారదునగ్రజుని వరసు
తనదుగను॥ చెడలె సుభద్రదేవియూ॥

వ. ఇట్లరుదెంచి తమ అన్నగారైన బలరాముని వీక్షించి,

సు-క. దండము శ్రీకృష్ణాగ్రజ, దండము మార్తాండతేజ ధరయదురాజా
దండము నీపదకమలము, దండని ప్రొక్కితిని బ్రోవుమా ర్తశరణ్యా

వ. అని ప్రొక్కిన దీవించి బలరాముం డిట్లనియె.

క. భండనవిజయులు నేర్పురు, పాండవులును కుంతి దేవి పాంచాల్యాభూ
మండలపతిసుతనీతన, యుండభిమన్యుండు సుఖము నుండిరె జనులూ

వ. అదియునుంగాక,

బ-గీ. వినుము సోదరి నీవిడు వేట్కదనర, వచ్చినటువంటి కార్యం
బు వరుసతోడ, చెప్పుమియ్యెడపను లెల్ల చెల్వముగను, నేనుదీర్చెద
మదిసంవయింప నలదు.

సా॥వా-దరువు-ఆది-కాంభోది

సు॥ కన్యవనిరేఖ నభిమన్యునకడుగుటకునా। నిన్ను సన్నుతిం
పానస్తినన్నా నేనూ॥ ని॥ ౧॥ బ॥ పాలుగ్రోలుచున్న పసిబాలురకు పెం
డ్లిసేయ। మేలు లేదీజాలిమానూ చెల్లెలయిపుతో మేలు లేదీజాలిమానూ
చెల్లెలా॥ ౨॥ సు॥ సుతుడొకడైనట్టి సుదతిసుతు పెండ్లిచేసి। చూడము
చ్చటనొందుదన్నా భువిలో॥ చూడముచ్చ॥ 3॥ బ॥ త్వరబడయనేలనా
తనయసౌభద్రుని। తరుణగానెంచతి చెల్లెలా॥ ౪॥ సు॥ విజయునికోడల
నుచు యిందరువినగను। నిజముగ గెల్పుమాయన్నా। నాతో నిజముగ॥

గీ॥ బ॥ దూరముజూచె వేలాకూరిమిమట్రిగుంట। శౌరి సాక్షిగనమ్ము చెల్లెలా మదిలో॥ శౌరి॥ ౬॥



బ-కందార్థం॥ బాలికనిమ్మని వలుమరు । చాలగ వేడెదవుసకల జనులు వినంగ। పాలుబడిద్రావెడుపసి । బాలకులకు పెండ్లిసేయా ఫలమేమీగలదూ। త్వరపడనీకు చలమేలావలదూ॥ ఇలలో మేనల్లుని కివ్వకితరుల కొసగు ఖలునకు నరకము గలదందురిలలోన॥ ఫలమేమీ॥

క॥ అమ్మాయెంతటిబేలవె, కమ్మనివిలుకానిసాటి ఘనుడల్లుడుగా
కొమ్మనొసంగెదనీకుగా, నెమ్మదిగానుండవమ్మ నీరజనేత్రీ॥

గీ. అనినసంతోషమంది యాయంబుజాక్షి, అన్నయీమాటని జమనిహాస్తమందు, హస్తమిడుమన్న బలదేవుడా సుభద్ర, పాణితలము నకరమిడి బల్కెమఱియు॥

బ-క. శ్రీమట్రిగుంట పురవర, భామునిసాక్షిగను దెల్పెదను సోదరి నీ
వీమహి సంతసమందుము, కోమలిశశిరేఖ నీదుకొమరునికిత్తున్

వ. ఈవిధంబున సుభద్రవాడంబరచుకొని యింద్రప్రస్థపురంబు నకుంజని సుఖంబున్న కొన్నిదినంబులకు దుర్యోధనుండు జూదంబున పాండవులనోడించిన యడవిజేరి దీనులయయియుండగా బలరాముండు శ్రీకృష్ణునింబిలిచి సుభద్రాభిమన్యుల రావించి సుఖంబున పోషింపుచు

గీ॥ బ॥ దూరముజూచె వేలాకూరిమిమట్రిగుంట। శౌరి సాక్షిగనమ్మ చెల్లెలా మదిలో॥ శౌరి॥ ఉ॥



బ-కందార్థం॥ బాలికనిమ్మని పలుమరు । చాలగ వేడెదవుసకల జనులు వినంగన్। పాలుకపడిద్రావెడుపసి । బాలకులకు పెండ్లిసేయా ఫలమేమీగలదూ। త్వరపడనేటికి చలమేలావలదూ॥ ఇలలో మేనల్లుని కివ్వకితరుల కొసగు ఖలునకు నరకము గలదందురిలలోన॥ ఫలమేమీ॥

క॥ అమ్మాయెంతటిచేలవె, కమ్మనివిలుకానిసాటి ఘనుడల్లునకున్
కొమ్మనొసంగెదనీకున్, ఇమ్మదిగానుండవమ్మ నీరజనేత్రీ॥

గీ, అనినసంతోషమంది యాయంబుజాక్షి, అన్నయామాటని జమనిహస్తమందు, హస్తమిడుమన్న బలదేవుడా సుభద్ర, పాణితలము నకరమిడి బల్కెమటియు॥

బ-క. శ్రీమట్రిగుంట పురవర, ధాముని సాక్షిగను దెల్పెదను సోదరి నీ
వీమహి సంతసమందుము, కోమలిశశిరేఖ నీదుకొమరునికిత్తున్

వ, ఈవిధంబున సుభద్రవాడంబరచుకొని యింద్రప్రస్థపురంబు నకుంజని సుఖంబున్న కొన్నిదినంబులకు దుర్యోధనుండు జూదంబున పాండవులనోడించిన యడవిజేరి దీనులయియుండగా బలరాముండు శ్రీకృష్ణునింబిలిచి సుభద్రాభిమన్యుల రావించి సుఖంబున పోషింపుచు

దగు॥ వెడ॥ తళుకూ చెక్కుటద్దముల బలుబెళుకూ। మొలకనవ్వులమోవి తేనియ లొలుకుచిలుకలకొలికియనదగి॥ వెడ॥ ఈశాసత్కృపతోఁ బ్రోవుపరమేశా। భాసురంబుగ మచ్చగుంట పురీశదాస విలాసశరణని॥ వెడ॥

ద్వి. అలివేణి నాదువృత్తాంత బుతెల్ల-విలసితంబుగనీకు విన్నవించెదను-శూరసేనునిముద్దు నూనుఁడుసుదేవు- డారయ నతనికి హాలధరుడుపుట్టె-దలపలరయాహాల ధరుడు మాతండ్రి-నలినాక్షి రేవతిఁను గన్నతల్లి-దుష్టవిదూరుండు దురితహరుండు-కృష్ణుండుపినతండ్రి మూర్తి శ్రీద్వార-కాపట్టణముమాది కాపురమమ్మ - నాపేరు శశిరేఖ నలినాయ తాక్షి ॥

వ. ఈ విధంబున తల్లికి నమస్కరించి యిట్లనియె.

శ, కందార్థం॥ తెల్లీనామనవినవే। యుల్లంబున వనహాబ జూడవలెననుకోర్కె। దెల్లముగ దెలుపవచ్చితి। చల్లగదీవించి పంపూ॥ సారసనేత్రి॥ చూడకమనసుతీరదిధాత్రి॥ కోరికతో వనవిహారము జేసియు। నారీమణులగూడి॥ వరనిమిషముకొత్తు॥ సారసనేత్రి॥

వ, జననీ మనవుద్యానవనము గనుగొనవలెనని నా మనమున కోరికబొడమేగావునచెలులతోగూడివిహరించివచ్చెద సెలవొసంగుమా

రేవతి, కందార్థం॥ శృంగారవనముచూడను। అంగనలతోగూడి వేడుకలరగబోవక। పొంగుచు జెప్పెదవిప్పుడు। సంగతిగాదింకవలదూ చాలించావమ్మా, నాపల్కును మేలెంచవమా॥ బాలిక మీతండ్రిబలరామమూర్తిదే, వాలగమనకుసు సంకటమౌనమ్మా॥ చాలించవమ్మా॥

వ. తనయానాతోటి వినయంబున వనముజూచుటకు మనవిజేసెదవు నీజనకుండు వినినేని హానికోర్వరాదు మర్యాద గాదు.

రేవ - దరువు - చాపు - ముఖారి,

వలదూపోవలదూ వనముకునీవు॥వల॥ వలదునాగగు పలుకువినుమిక జలజలోచన చలమిదేలను। బలుడు మీతండ్రివినమనకును కలతగలుగును దలపవలదిక॥ వల॥ సరసిజనేత్రినీసాటియాగరితలీధాత్రి। గురుతరంబుగతల్లియాజ్ఞలో నిరతమును వర్తించికీర్తియు। రమరింపక గాంచినదినీ వరయ లేదటె ధరణినురలన॥వల॥ సందీయుమిక నావలదిక నీదు

డెందమందుననూ। మందగమనరో లింగయాహ్వయునందుసత్కృపజెందియుంచిన। నందతనయుండైన శ్రీగోవిందుడిందుకు నిందవాయడె॥ వ॥



సంవా - దరువు - ముఖారి

శ॥ అమ్మా-నీవిటువలెను వనమున। కరుగుటకు మర్యాద గాదనియంటివీ పోవలదంటివీ। అమ్మా। రే। సమ్మతిగ నేనన్నివిధముల। జెప్పిననువిన వేమి సేయుదుబాలికా। నాపల్కులన్నియు మేలికా। అమ్మా। శ। మల్లెలును చేమంతికుసుమము। లెల్లగోసుకయుల్లమలరగవచ్చెదా। నీసన్నిధికినరుదెంచెదా। అమ్మా। రే పుడమిలోపల పూర్వమందున। బుద్ధిమతులగు స్త్రీలుజెప్పగవినవటే। దుడుకాడేవుబల్ చలమటే। అ। శ।వోంటిగానరుదెంచుచేడెల వాసితరుగునటంచుపొలతులవెంటనూ। సెలవిస్తినరిగెదవెంటనూ। అమ్మా! రే వాసిగమన్త్రిగుంటపురీశు నాత్మలోనమ్మివేగమె।పోగదె ఆలస్యముంచుకరాగదే। అమ్మా। శ। అంగనామణివినవెబాంతాలింగయాహ్వయునేలుశౌరినినమ్మితి। నిరతంబు నాహృత్సమ్మతి। అమ్మా।

వ. ఇట్లుశశిరేఖ తల్లిచే సెలవుగొని వనంబునకువచ్చిశృంగారంబుజూచుచున్న సమయంబున అభిమన్యుండు శశిరేఖనుంగాంచి

అభి. క. శశిరేఖ నరసినంత నె, కుసుమాస్త్రుని విశిఖములను గురుతుగ వేయుచు। పశుపతిమిత్రునియల్లుడు। రసికతగనుబల్కె నపుడు శశిముఖులన్నపుడూ.

గీ ముద్దుగుల్కెడు శశిరేఖ మోముసొగసుచూడకీరంబుబోలు వాల్చూపుకోప్పు, నరసనవరంపుకుప్పెపసందురవల, కెంపుముక్కరగల కన్య కెదుటనిలచి,

అభి-దరువు-చాపు-శ్యామ

ఈమందయానముగంబసుందర మిందుసమమందూ। పూర్ణేందు సమమందూ దీనియందమేమందూ। యీమం। సుమశరునినారి సమా నము గుకరు బొమలచందంబూ, సమమైనరదనంబూ లధరంబుమధురం బూ, యీమం, పాలిండ్లుబంగరుగుండ్లు సొగసగు మల్లెపూచెండ్లుయీ లాటియిల్లాండ్లు వేరెదుకవెయ్యేండ్లు, యీ. ధరమద్రిగుంటపు శుడగు కరివరదు కృపయున్నా, తరలాక్షితాకన్నా ధాగోరితిక విన్నా, యీ.

అ-ఉ. కాంచితి దేవకాంతలను గాంచితి నింద్రుని కన్యకామణిన్
గాంచితి నాగకన్నియలగాంచితి మారునికన్యయౌరతిన్
గాంచితి రోహిణీగుణినిగాంచితి యక్షసరోరుహాక్షులన్
గాంచితి గాని దీని సరికామిని నెక్కడ గాన నీభువిన్.

అభి-కందార్థం, చక్కనిమా క్తికహారం, బక్కజముగరత్నపత కమమరి యురమునను, చక్కెరదిండిపాలుజేరుని చొక్కపుసింహాసనం బూ, సొబగునూ గాంచితినేని యబలనూ, శుభవిభవంబగుసుందరిరూ పం, బభివర్ణించుట కరహంబగునే, సొబగునూ

గీ. ఇంతిగాదిదిరత్నాలదొంతిగాని, దొంతిగాదీదిమల్లెపూబంతి గాని, యింతికిటువంటిలావణ్యమేర్పరించిచేసినటువంటియజునకుచెల్లెనర

వ. అనివెంగటకుచు జని యిట్లనియె.

దరువు-రూపకము-దర్బారు

సుందరాంగి నీదుముఖముజూపిముచ్చటాడు, సొగసుగభళి, సుం ద, నందియామదేలె తొందరగను, యిందువదనముఖము జెందుదమిక, సుంద, ముల్కనగవు మోవితేనెలొలుకబలుక వేమి; కలకలమనిపలుకు

లుబంగారమటె జిగిబిగి కులుకుచన్నొనలొసగు మలుకిడెదను, నులజ మదనుడమ్ము లధికముగను గదిమివేసెగదవె, మదవతిగను వదలజాల గదవెరతికిదనము,గదిసికోర్కె దీర్చనదునిదెబలు, నుం, అంగనరొవినవె బొంతాలింగయాఖ్యు నేలు కరివరదుడు, సంగతిమీరంగవినినసుమది సంభ్రమించు మదిని సరిసరియని, నుం,

శ-శ. ఆమాటలు తావినియా, రామామామాటమిడచి రాజకుమారా
సామాన్యమెపరసతులను, ప్రేమించుమటంచుబల్కె పెత్తనమానా

శ. ఇష్టంబుగానిపల్కులు, శ్రేష్టంబులటంచుబలుక చెల్లునెనాదా
యిష్టంబుదెల్పెదనుకుల, మిష్టంబును లేనిపల్కులిడుమున్నపాలా.

అభి-ద్వి. సారెకుపరుడని జెప్పుటనీకు-నోరెటులాడెన లోగడ నుంచి-సీతంద్రులిద్దరు నిన్నునాకొసగి-ప్రీతితోపరిణయం బిడెదమటంచు బలుకుటయింతలో మరచితివటవె-యలనాగకుచగిరు లెదనుంచి మోవి నొక్కుచురుక్కున నొకముద్దుబెట్టి-చక్కెరకెమ్మోవి చయ్యననిచ్చి-గొబ్బునకవగూడు కోర్కె లుదీర-యిబ్బువి మత్రిగుంటేకుండు గలదూ






శశి కందార్థం. మావంటి స్త్రీలనరసియు, మీవంటిన్నపేంద్రులిట్లు మేదినిలోన౯, భావజు కేళికి బిలచుట, భూవరమర్యాదలే నీప్రమా

టలూ॥ బల్కినసాటిలోటులూ। నూటిగ పేల్వము జూతురు నుతిమతు
మాటలేల సమ్మతముగ జనుమీ॥ మాటలూ॥

గీ. ఒంటిగా వనవిహారంబు వచ్చినట్టి, బాలికనునాతో వీకిట్టి పంతమేల, యెవరయినను విన్నను సన్వోపోదు, రవని యిదిహాని విన వయ్య రాజవర్యా.

అభి-క॥ శశిరేఖ నిన్ను నేటికి, విశదంబుగ చూడ నాకు వేడుకగల్గెన్
కుసుమాస్త్రు కేళికిప్పుడు, వశమై మోహంబుదీర్పు వనరుహనేత్రీ.

వ. ఇట్లు బలుకుచున్న శశిరేఖ విని చెలులకిట్లనియె

శ జరువు జంఝూటి.

ఎంతమోసమాయె నేచెలి । యింతలోపలా॥ యెంత॥ పంతము గను చెంతనుమరు। కాంతుడువిధి పంతముగ నె॥ నెంత॥ జననిజెప్పినట్టిపల్కు విని శుభమగు। అనయంబును మన నకను। జనుదెంచిన సౌఖ్యంబిడి॥ యెంత॥ సంగతిమీరంగ గాంతా లింగాయాఖ్య వరదుసత్కృప। యుంగల్గిన భంగములే కంగనలము నల్లగగల॥ మెంత॥

వ. మరల నృపున కిట్లనియె

క. పరిణయముగాని స్త్రీలతో, పరిహాసములాడనీకు మర్యాదగునా
పరిపూర్ణసోమముఖనుం, దరసురరాజేంద్ర పౌత్రిధరవరుపుత్రా.

అ ద్వి. మీనాక్షీ రోనీకు మించుముఖకాంతి గానక చంద్రుండు కళహీనుడయ్యె, ముదితనీచెక్కులకు ముకురంబులోడె, వదగిరిసంయుక్తమై వసుధ చిక్కె, గాననీపక్కకు కడుజేర్చి నన్ను, మానిని యధరంబు మదిదీర గ్రోలి, సమరతియువరతుల్ సౌఖ్యంబుగాను, తమిదీర నేలించు తరలాయతాక్షి, శ్రీమట్టిగుంట పురీశునియాన, ప్రేమనాపెడనుంచి ప్రియమునుగాంచు,

జంపా దరువు చాపు శ్యామ.

అ॥ వాటమారతీ కూటముకుసీ। సాటిబోటినిగాన నే॥ పాటలాధరిబటువుకుచములు। గోటమీటగనియ్యవే॥ వాట॥ శ॥ మేటినృపయిటు కూటమనుటకు పాటిగాదిటు బలుకకూ। సాటివారలువినిననన్నికచౌక జేతురుచనుమికా॥ మేటి॥ అ॥ మామకూతుర వనుచు నేనతిమమతతో

నెరనమ్మితీ। మామలిద్దరు కొమ్మనిపొమ్మనగ నీవడివినవలే॥ వా॥ శ॥ పరిణయము గానట్టిగరితలు పురుషులకు వశమయినయా। గరితలను తలిదండ్రిబంధువుల సమంబుగ నెంతురూ॥ మే। అ॥ రాజులకు గాంధర్వ పరిణయమిాజగంబునగల్గెనే। రాజిగను గావించి సమరతి యాజికి ప్పుడురాకదే॥ వాట॥ శ॥ బాలప్రాయపు బానసేనూ బలిమిసేయూలే లనూ। చాలుచాలిక వనముకొచ్చిన మేలునమ్ముకోవలెనురా। మేటి। అన్యాయమెరుగనిదానలింగమ నాయునేల్ హరిసాక్షిగా। కాయజునిబాధలకునోర్వను కరుణతో నన్నేలవే॥ వాట।

వ. ఇట్లు మమతతో కరంబు వడసిపట్టుకొనిన శశిరేఖ యేమియు ననసేరక తలవంచుకొనియున్న అభిమన్యుం డిట్లనియె.

అ – దరువు చాపు – ముఖారి.

మొగమెత్తినాతోడ ముచ్చటలాడవే మోహనాంగీ॥ నను॥తగినట్టివరుడని తలచిముద్దియ్యవు మోహానాంగీ॥ మొగ॥ పలుకులనమృతము లొలుకగబలుకవె కులుకులాడీ॥ నీ॥ కలువరేకులవంటి కన్నులజూడవె తలిరుబోణి॥ మొగ॥ కాయజుశరధాటి కియ్యేడనోపను తోయజాక్షి। నిన్ను। బాయనెలింగమ నాయునేలినపురగ శాయుసాక్షి॥ మొగ॥

వ. అంత శశిరేఖ అభిమన్యుని చెయ్యిని విడిపించుకొనుటకుసామర్థ్యంబు లేమించేసి యొకయుక్తి దలపోసి యిట్లనిరెు.

శ–క పడలులువచ్చిరినాచెయి, విడిపింపుమటంచుబల్క విని తత్తరముక్ బిడియంబునొందివిడిచిన, తడబాటుననగరుజేరుతనాలహాపడుచుక్

వ. అంత అభిమన్యుండు చింతించి యిట్లనియె

అ – దరువు – చాపు – ముఖారి.

శ్రీమాల్యాచల నారసింహానీపదసేవజేతుదేవా। భామాశశిరేఖ నావల్కలినదాయె మహానుభావా॥ శ్రీమా॥ శశిరేఖపై మోహ శరధి నీదగ లేను శ్రీనివాసా। నా। వశముజేయునవి శశినేత్రదరహాస శ్రీనివాసా॥ శ్రీమా॥ జనకులు వనవాసమున దుఃఖమొందుదు గానలోలా।యిప్పుడు దీనులయియున్నారు గానదయనేలుము దీనపాలా॥ శ్రీమా॥ గరిమ

తో బొంతాలింగాహ్వయునేలిన దురితదూరా। కరుణతో నాకిపుడుక ల్యాణమొనరింప కదలిరారా॥ శ్రీమా॥

వ ఈప్రకారము భగవంతుని వేడుకొని తనగృహంబుచేరి శశి రేఖపై మోహపరవశుండై యుండె అంతశశిరేఖ నగరుచేరి అభిమన్యు నిదలంచి చెలుల కిట్లనియె.

శ - దరువు - రూపకము - జంఝూటి.

అమ్మయెటులచేతు నీ విరహమ్ము లెటులసైతునే। అమ్మ। కమ్మ విల్తుని భారికోర్వనమ్మవిరహమధికమాయె। నమ్మ। కరముబట్టి ముద్దు బెట్టు కాంతయునిన మోమువంచి। కరుణలేక ద్రోహమతినై త్వరగ వచ్చితి మరులుదెలియక। అమ్మ। అలగినన్ను పెండ్లియాడ తనచునో మది దలపడో। యింనుబొంతా లింగయాఖ్యు డలచుహరిని దలచనైతినో। యమ్మ।

వ. ఇట్లుచింతింపుచుండగా సురమునీశ్వరుండైన నారదుండు వచ్చువిధం బెట్టిదనిన,

నార దరువు ఆది మంగళకాచి.

వేడలివచ్చెనూనారదమౌనీ। వెడ। వెడలెవడిగకడు వేడ్కచెలంగగ। కడుపుబ్బరముతో కలహప్రియుడపుడె। వెడ। జింకవల్కలముచం

కనుగొనిడితా। లాంకునికొల్వూరు శంకలేకబల్। వెడ। శ్రీసత్యగోధపురీశుని మనమున। ధ్యానముమరువని తాపసవర్యుడు। వెడ।

వ. ఇట్లువచ్చిన నారదునింగాంచి బలరాముండు అర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యిట్లనియె.

బ,గీ. శ్రీకరంబుగ యీమూడు జగములందు, తమకుదెలియని వార్తలు దలపలేవు, గానయేమయిన సంగతుల్ మౌనివర్య, విన్నవింపుము వినిమొద వేడు కలర,

నార। ద్వి వినవయ్యభూవర విన్నవించెదను, ఘనముగనేజెప్ప కార్యమంతయును, నీకుమేలొనరింపనే తెంచినాడ, ప్రాకటంబుగజనుల్ ప్రస్తుతింపగను, కరిపురమేలెడు ఘనకీర్తియశుడు, దురితవిదూరుండుదుర్యోధనుండు. కొలువున్నసభలోన గూర్చుండితాను, బలరామమూర్తి సంబధంబుమాకు, గలిగితేమేలని కడుసంభ్రమునను, పలుమరు సభలోన బల్కుచుండగను. వినివచ్చితినినీకు వివరించుటకును, పనివడినిజముతో బల్కెడివాడ, ధరనన్నబ్బయ దాసునిబ్రోచు, కరివరదుని సాక్షి కపటంబు కాదు.

వ. అనిన బలరాముం డిట్లనియె.

బ,కందార్థం। వారియున్నశ్శనుపడి। సారాంశం బింగవలతునన్నునివాధా। కోరికమీరగదెల్పుము। కూరిమితోనాడుసుతను। గొప్పగా। యిచ్చెదనునీవు। జెప్పగా। గొప్పవారలతోతప్పకవియ్యము, నివ్వాడుగల్గునా యెందురు భువిలో గొప్పగా।

వ. అనిన నారదుం డిట్లనియె.

నా,క. ఆజననాథుని సుతుగుణ, బీజగముల కీర్తిగల్గ నితనికినాకుం భోజన లక్షణుడంచును భూజనబుధవర్యు లనిరి భువిప్రఖ్యాతిగా.

వ కావున నీకొమార్తెయైన శశిరేఖను లక్షణునకొసంగివివాహంబు కావింపుము బలరామనృపాలా

వ. ఈవిధంబునం జెప్పి నారదుండు హస్తినాపురంబునకు బోవునంతలో దుర్యోధనుండు కొల్వునకు వచ్చెనటా యెటువలెనూ.

దు. - దరువు - ఆది అహిరి.

దుర్యోధనమహారాజు కొల్వునకు। త్వరితంబుగావచ్చెర॥దు॥సా ర్వభౌము డతి సాహసధైర్యం। డార్యులు బుధజనవర్యులుమెచ్చగ॥దు హాటకాంబరము లమరధరించుక।మేటినృపోత్తముడూ।దాటిగరత్నాల్ దాపినమణులకి।రిటముశిరమున నీటుగదాల్చుక। దు। ధర దివికిముఖ ద ర్పణమనియెడు కరిపురవల్లభుడూ గురుతుగ శ్రీస్యగ్రోధగుంటపురి వర దుడైన నాక్సరి గాడంచును దు.



వ. ఓరిచోబ్దారి బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాదులు మొదల యినవారందరున్ను వారివారిమతాచారంబులం బట్టి నియమంబులుజరు పుకొనుచున్నారా

ద్వి. వినరోరిచోబ్దారి వినవింపుగోరి-మనపురిలోవారి మందిరా లుజేరి-కర్ణుని ద్రోణుని ఘనుడైనకృపుని-కర్ణునితనయుండు కడుదుష్టకే తు-దునుభీష్మసౌబల దుస్ససేనులును-పనివడి కృతవర్మ బంధుమిత్రు లును-పొందుగా సయింధవ మొదలయినసరసు - లెందుకు రాలేదొ వేగ బిలిపించూ.

వ. ఇట్లు కొలువై యున్న సమయంబున నారదుం డరుదెంచిన దుర్యోధనుండు వందనంబు లాచరించి యిట్లనియె.

దు—మత్తకోకిల॥ నారదాఖ్యమునీంద్ర నీచరణారవిందములెప్పు డుఁ. కోరిమ్రొక్కెద లోకములలో కొన్నివార్తల్వినిమెదఁ, మీరు లోకతృతీయ మెప్పుడు మేరుసంచార్లవౌట యుఁ। ధీరవరమీకరుణతో డఁ దెల్పుమిత్తరి వేట్కగఁ।



వ. ఇట్లడిగిన రాజునకు నారదుం డిట్లనియె.

నా,క. నీలాంబరువరతనయగు। బాలామణిచక్కదనముబ్రహ్మకైనఁ యేలీలగణన సేయును। చాలదుయాసఖియ నేమి జెప్పుదు సహాహా।

ఉ. ఆసఖిమోమునుఁ మరియునాసఖినాసిక మస్తకంబునుఁ
యాసఖినేత్ర కర్ణములు నాసతికంఠము నాభియందముఁ
యాసఖిమధ్యముఁ పిరుదు లాసఖియూరులు జంఘ లాదిగఁ
యాసఖి వర్ణనంబు భువి నంతట గానను మానవేశ్వరా.

వ. ఇదియునుం గాక.

క. చూడగశశిరేఖయు నీ। కోడలుమైయొప్పచేని కులబలమునకుఁ
యీడగుబంగారమునకు। జోడుగపరిమళము గల్గు చొప్పుననధిపా

వ. అని చెప్పి నారదు డరిగిన దుర్యోధనుండు బంధుమిత్రాదు లతో నిట్లనియె,

దు దరువు ఆది కమాను.

నేటికిమేల్ మాట వింటివీ ఆచార్యులారా। నేటి। మేటియాబల రామతనయ, తోటిసాటిబోటినచట, పాటిగలేదను నీపూట సాజుమే

టిజటిలుడిటను, నేటి, ఈలాటిశశిరేఖ నిచ్చి చాలగ మనలక్షణునకు, మేలుగ పరిణయము జేయ నను,కూ లుడై యున్నాడటబలుడు, నేడి, విం టిరే మీరంతమఱ్ఱి గుంటశౌరాగ్రజుశిపురికి॥ వెంట నవిప్రులబిలచి వేగి రమున పంపుడిపుడు. నేటి.

వ ఓహో బంధుమిత్రాదివర్గంబులారా బలరామునివియ్యంబు వలన గలుగు ఫలంబు దెలుప నలవియుంగాదు నీలాంబరుండు మనవా డౌ ఆవలన నీలవర్ణుండు మన పక్షం బంపుటకు సందేహంబు లేదుగా వున పాండవులు నన్నెదిరింపం జాలరు వారినిం జయించి నవఖండభూ ములు నేనే యేలంగలవాడను యిప్పుడు సమయము మంచిదియైయు న్నది ద్వారకానగరంబునకు బ్రాహ్మణుల బంపుడీ.

వ, అవిబంపించిన బ్రాహ్మణులు ద్వారకాపురికే తెంచి రెట్లనిన

దరువు చాపు మోహాన.

భూసురోత్తము లొచ్చిరీ,ద్వారకపురికి, భూసు. వాసిగకరిపురాధీ శుడొసంగిన, భూషణాంబరములు భాసురంబుగదాల్చి, భూ, పంచాం గములు చంకను బెట్టియును వివరించిసద్వంశులునూ,యెంచగద్వారకకు వేంచేసిబలుతనయా, చంచలాక్షినినునమ్మాక్షించుదమని వేగ,భూ,కూ రిమిలోడతను శ్రీమత్ మఱ్ఱిగుంటపట్టణముననూ,ఆరూఢివెలసినగౌరీశు మిత్రులు, సారెకు మనమున సన్నుతి జేయుచు, భూ.

వ. ఇట్లరుగుదెంచి అచ్చటివృత్తాంతంబు బలరామునికెరింగించిన విని పేదవానికి ధనంబు దొరికినచందంబున సంతసించి

బ-క. సోదరిచ్చినవాక్యము, సాదరమునదలప కతడు సంతోషముతో

ఆదుర్యోధను డంపినభూదేవుల గాంచిపల్కె భూవరు డంతన్.

క. వినుడీ భూసురవర్యులు, జననాథునిపల్కు కెదురుజెప్పందరమా

తనియేమినాదుతనయకు, పెనిమిటి లక్షణుడుగాక పెరవాడౌనా.

వ. ఈవిధంబున సంతోషభరితుండై తత్పురిబ్రాహ్మణులంబిలి పించి వోభూసురోత్తములారా దుర్యోధనకుమారుండైన లక్షణునకునా కొమార్తెనొసంగితి గావున శసితారాదులు వీక్షించి వివాహలగ్న మేర్పరచరయ్యా, అంత బ్రాహ్మణులు శశితారాదులు పరికించి నేటి

తొనిమిది వాసరంబులకు వివాహలగ్న మున్నదియని చెప్పగా బలరాముం డు పరివారులం బిలిపించి యిట్లనియె,

బ, కందార్థం, వినుడి మీరలునాదగు, తనయా శశిరెక పెండ్లి దాకొనివచ్చెఁ, మనపురి శృంగారింపను, ఘనముగ సాటింపుడీపుడూ, గరిమతో, జనులుందురెమో, మరువుతో, స్థిరముగ పురమును పరిమ ళించుక్రియ మరువక పడి చిత్తరువులు వ్రాయుడి, గరిమతో.

వ, ఇట్లు పురంబు శృంగారించుచుండగా చూచి సుభద్రాదేవి చెలుల కిట్లనియె,

సు-కందార్థం, అంగనలారా మనపురి, శృంగారించెదరు చూడ చోద్యంబుగ నాకుంగల్గె మనసు ''రిక, సంగతియదియేమొనాతో జె ప్పరె నాపల్కులిపుడూ చెప్పరె। తప్పగపండుగ తెప్పుడొనర్తుకు యి ప్పుడు శృంగారించుట కేమో జెప్పరె.

వ ఇట్లడిగి చేలులవలస దెలిసికొని తమ అన్నగారి కిట్లనియె.

సు గీ. అన్ననియల్లు డగుయభిమన్యునకును కన్యశశిరెక నిచ్చెద ఘనముగాను యనుచు శపథంబు జేఁతివల్లనాడు గాన దయసేయు మియ్యెడ గరుణతోడ.

సు క. అన్నానీయల్లునకును కన్నియశశిరెకనొసగి కల్యాణంబుఁ పన్నుగ జేతునటంటివి మన్నఁతోనొగగుఁయ్య మరిబూవర్యా

బ గీ. ఘనముగల్గిన దుర్యోధనుని తనూజా వైనలక్షణునకుని స్త్రీ సంబుజాక్షి నదియుతప్పట నాకు మర్యాదయగుఁ పలికిబొంకిన వాడ ని ప్రజలు నగరె.

వ అ న సుభద్ర చింతాకులమానసురాలై యిట్లనియె

సంవా - దరువు ఆదితాళము యమునకుల కాంభోజి.

సు. అన్నానీవునన్నాబ్రోవా కున్నవేరెవరున్నారు అ॥ పిన్నపె ద్దవినియు నవ్వుచున్నారన్నానన్నరసిఅన్నా బ ఇన్నిపల్కులన్నా ఫలము లున్నావట వేసోదరీ అన్నాపానాదులకేగతిలే కున్నాదానవుపోవమ్మా ఇన్ని సు కళిమిలేమి బలమూలెన్న నలదూనీమేనల్లూడూ చలములే లాజలజాక్షిని సౌభద్రున కొసగుమూ అన్నా బ ద్రవ్యాధికుడగు. దు

ర్యోధనసుతు కివ్వక నితరులకిచ్చెదనే నవ్వులమాటలునాడితిమునునే క
వ్వాడితనయున కిత్తుననీ ఇన్ని ఉల్లాసముతో చెల్లెలిసుతునకు పిల్లనిచ్చు
టకు యుల్లములో యెల్లలోకు లెల్లవర్తింతురు బల్లిదుడవు యదువల్లభు
వే అ బ పోవేబొంతా లింగమనాయుని బ్రోచే శ్రీహరి సాక్షిగనూ, బూ
విభుడై నే బొంకుదులట వే-నీ వెతలెందుకునివ్వనుచాలు, ఇన్ని.

ను, ద్వి అన్నయ్యనేజేయు అన్యాయమేమి కన్నిసులువ్వని కా
రణంబేమి ఎన్నెన్నివిధముల వేడిననీకు పన్నుగా నామీద పంతమే కాని
పగవారిబిలిపించి పట్టినియొసగి నగుబాటుజేస్తివి నలుగురిలోన ఇంద్ర
తనయునితోటి వియ్యమందకను పొందుగా కురురాజు పుత్రునకిచ్చితో
డబుట్టినదాని త్రోసివేసియును చేడెనుపగవారి చేతికిచ్చితివి మేనరిక
మ్రుత్తర్ని మేదినిజనులు మానుగావంపినమాటవినలేద ధరమట్రిగుంట
మిరేధాముని కరుణ మరియెటులున్నదో మదినెన్నరాదు,

బ. ఉ, పంతముతోడ నీవు బలుప్రజ్ఞలుబల్కిన సాగబోవు నీ
వెంతప్రయాసమొందినను యాత్మజరాదిక మానుమాశలుక
దంతిపురాధినాధునకు ధన్యులు మెచ్చగ యిచ్చినాడ మీ
రంతవనాంతరంబు జనుడాకులుభక్షణ జేసియుండగక.

ను, కందార్థం రేవతినాయక మనవిను నీవెరుగనినీతిగలదె నీజగ
మందుక కేవలము కరుణలేకను బూవరకురువిభునకివ్వాబూనియున్నా
వనియుజెప్పగా వినియు కావుననీపద కమలంబులకును నేవయొనర్చుచు
జేసెదజోహారు బూనియు.

ను దరువు శ్యామ చాపుతాళము.

కరుణించుమన్నా బలరామన్న క కిరియులేమెన్నాల ఏకటి సమ
మని మెరిగిమెరుగనిరీతి నరమరవిలాను కరు ఇత్తరిశశిరేక నిత్తుననక
యున్న అత్తింటనవమానము సమ్మదవునన్న క శ్వేతవాహనుడెపుడు
నీతోవియ్యముగోర ప్రీతితోదలచు ప్రఖ్యాతిగలవాడంచు క అడవిలో
తండ్రుల నెడబాసి సౌభద్రు డిడుమలబడుటాయు బుడమినీకపకీర్తి
కగు గరిమతో బొంతాలింగాహ్వయువరదూని సరస చెప్పినమాట మరు
వావోవలదింక॥ కరు॥

గీ. అన్ననీకన్న బలమునాకన్న నెవరు లేరుసౌభద్రునకు శశిరేకనొసగి
పెండ్లిగావింపు కరుణతో పేదవారి నాదరించినకీర్తిగలదవనిలోన.

బల దరువు ఆదితాళము బ్యాగ్ రాగము,

చాల్ చాలు పోపోవమ్మా సోదరినీవు చా పాలూచక్కెరజున్ను పరమాన్నం భుజియించు నాలూకవేపాకు నములినచందమా చా చేడెమీరిప్పూడు కూడూకోకయులేక యీడకరుదెంచి నాయింట పడి యున్నారెపుడు చా కోడలులేకుండిన కొడుకయ్యెనేమోనీ మేడ మిద్దెలలోన మెలగెడువారులేరె చా పంతములేల శ్రీ బొంతాలింగాహ్వాయుని సంతరించెడుశౌరి సాక్షిగనివ్వనింతె చా.

మ క. కలిమికలవారికేలలో, చెలియామణినిచ్చిపెండ్లిజేయుటఘనమా
నిలపేదకిచ్చిచేసిన ఫలనిహపరసౌఖ్యమబ్బవచ్చుని యశస్సు యి

. మ గీ. పద్మలోచనశశిరేక భానురాంగి బాలుడభిమన్యుసూత్రనీ బల్కితీవు మాధవాగ్రజునమ్మించి ప్రమానిమీదచేయి విడుపించుచందాన జేసితన్నా.

వ. అనినకోపారుణితనేత్రుండై బలరాముం డిట్లనియె.

బ, సీ. అంతరుమీవార లడవిలోఖిన్నులై గుందుచుండగ బెండ్లికూతురనుచు పలుమరుబల్కిన ఫలమాని భాగ్యహీనుల కెక్కడైనను నిత్తురటవె ఏకులంబునసైన నేమగువలసైన విన్నకన్నంతట నెరుగరాదె ముందుమీచుట్టరిక మందనుభవముచాలు యీపెత్రినీకేల నిపుడు గల్గె భాగ్యదుర్యోధనుడుమాకు బంధువయ్యె ఇంకనీతోటిపనియేలయితరులేల ధర్మభీమార్జునులు మాద్రితనయులేల యెందరుండిన కురురాజు కిందుగారె.

క. కురురాజునగ్రసుతునకు వరపుత్రినొసంగి తనివదాదొడెనవా
తరుచగుపల్కులువిడిచియుగుసుతుగమీవారికడకుగొబ్బునజనుమీ

వ. అని తూలనాడిన సుభద్ర చెలులం జూచుచు హాలధరునకిట్లనియె

సుభద్ర దరువు రూపకము జంఝూటి.

తరుణి నడిగిపరువుతరిగె। మరియునిప్పుడూ॥ తరు॥ దురితహృద

యుడైన సుయోధనుడెయిష్టుండా! తక! అనిచెప్పినట్టి క్రోధమునుభరిం పవా! తోడబుట్టినిట్లు దూరకోపముగాదా! తక! చిన్నగాక యిన్ని మాటలన్నచెల్లెగా! పన్నగానాథ శ్రద్ధవిని బ్రతుకనిచ్చునా! త! కండి శూరులయినయట్టి పాండవేయులా తిండకేసివారలుంటివి కండివాలికి! త॥ ధరణిలోనమత్రిగుంట వరమునకు వాసా! విరతముగలిగున్న పూర్ణ త్వరగసుఖముగా! త॥

ద్వి. కొడుకు తెనై యున్న కోడలురాదె తడబాటుతో! సుతున యునీకున్న గంతకుతగుబొంత గల్పించెనజుడు సంతవారయినసుయోధ యుడెరుపుదురె సదయాత్ము చనినిన్ను చానమ్మితిని హృదయుకేను డంచు వూహించనైతి కానులకాసించి ఘనముబోల్చిడివి దోసమాయ నృతంబుతో బల్కితివు కౌరవాధిపుగాడి కలరాజ్యమేలు కూరిమన్న గ్రోధ గుంటహరిగలడు.

బ, వ, ఏకచక్రముగా రాజ్యమేలెడుదుర్యోధనుని కొమారునికి వ్వాక నీకొమారునికిచ్చుట విరచికట్లపై పూలదుప్పటిగానుండునుగావు న పెక్కుమాటలేలపోవే సుభద్రా సుభద్రతో బలరాముండిట్టివా క్యంబులు బల్కుచున్న చారులవలనవిని శ్రీకృష్ణుండువచ్చుమార్గంబెటు వలెనుండును.

కృష్ణ-ద్వి. కరముప్పశ్రీద్వారకాపురిలయు దరవిందనేత్రుండ య్యమరవ్రాజితుడు దురితవిదూరుడు దుష్టహరుండు కరుణాసముద్రుం డు కంసభంజనుడు వసుదేవదేవకీ వరగర్భజుండు పశుపతిమిత్రుండు పంకజాక్షుండు సకలాంబరంబులు సకలభూషణము అఖిలవేడుకలతో నవుడుధరించి వడిగ తాంబూలంబు వసతలందియ్య విడియంబుచేయుచు విశ్వేశుడపుడు ఘనమైనబొంత లింగమనాయునేలు వనజనాభుడు వేగ వచ్చె కొల్వునకు.

కృష్ణు దరువు మోహన ఆది.

వాసుదేవుడగుదెంచెనుకొల్వుకు భాసురముగనపుడూ॥ వాసు॥ దానవపోషు దశవేషమేటిభవ! దోషపాశమీనున తెగటార్చిన॥ వాసు॥ పుండరీకనేత్రుండుశిరంబున దండకిరీటమునూ! నిండుసంతసమునముండి

ధరించెను॥ మొండిరిపుల గుండెలవియుచుండగ॥ వాను॥ మదనజనకుడగు
మట్రిగుంటపురి మందిరవాసుండూ। గదిసి జొంతలింగాహ్వయుసనిశము
వదలనిముదమును మదినిడి బ్రోచెడు॥ వాను॥

వ. ఇట్లరుగెంచిన శ్రీకృష్ణునకు సుభద్రవందనంబులాచరించుట

సు-క. దండమురుక్మిణీనాయక దండముమురశకటకంస దావవహారణా
దండమునీదగుచరణము లండని నెరనమ్మి నానుయనుదినమునసూ

సు-ద్వి. మీనకేతనజనక మీ కడ కేను మానుగ జనుదెంచుమసూ
ర్గంబువినుము-అన్న బలదేవుని యాత్మజయైన కన్నిశశిరేఖను కమలాక్ష
నీదు సన్నిధిమనమున్న సమయానమున్ను చిన్నియభిమన్యునకు చేడె
నొసగెదను యనిచెప్పెనపుడు సభనందరువినగ అనయంబుసంతసమం
దుచును-టె నిప్పుడుకరిపురి నేలునృపుసుతునకు తప్పకిచ్చెదనని దలచిన
పల్కు - విని నిన్నుప్రార్థింప నిటకువచ్చితిని ఘనమట్రిగుంటపురి కం
జాక్షశౌరీ.

వ. అనిన బలరామునితో శ్రీకృష్ణుం డిట్లనియె.

కృ-ద్వి. అన్ననీకిదిధర్మమవు శశిరేఖ నెన్నయభిమన్యున కెల
మిలోనిత్తు నని చెప్పితివిభువి నందరువినగ మనమునదిమరచి మాటయు
దప్పి హస్తిపురివాసుని యాత్మజునకిపుడు నిత్తుపుత్రినటంచు విప్రులబిలచి
యారీతిమర్యాద లిల జేయదగునె కూరిమి శ్రీమట్రిగుంటపురిజనులు
వినసహించరుగాన విజయాత్మజునకు ఘనమైన సంతోష కరముతో
నొసగు.

కృ-వ అన్నా మనసోదరితో నీవహితవాక్యంబులు బల్కుట
విహితమానా.

బ-క. సోదరమనశశిరేఖను, పేదలకిచ్చినసుఘనము పేల్వంబౌనూ
నీదగుమదియోచింపుము ఆదుర్యోధనునితనయు నల్లుని జేయూ.

కృ దరువు అట మధ్యమావతి.

ఇటులనుటకుపరువా సోదరియందు కుటిలాబిడచుటకు బరువా॥
యిటు॥ కుటిలమును మదినుంచిధర్మజు నటమునను నోడించిరాష్ట్రము
తటుకునను గైకొనియువారల నడవికనిపిన నదియెరింగియు॥ యిటు॥

భూతలంబున నీతిగల ప్రఖ్యాతియుతులవు పాండుసుతులకు నీతనూజ నొసంగుమిప్పుడు గాతురటుగా కున్నగావరు॥ యిటు॥ అన్ని దెలిసిన వాడవై యిట్లాడుటకు మర్యాదయగున పన్నుగానీవు గాక వేరొక డన్న మన్నింపకనే దుసుమయా॥ యిటు॥ ఉత్తర న్యగ్రోధపురమున మొదమున నిలగొన్న శ్రీదా। మునరుండని మరిగిమదిలో భేదవాదముతోప నేమన॥ యిటు॥

వ. ఇదియునుంగాక,

కృ-గీ. ధరలోమేనల్లునకు తనయతనయనొసగ, కితరులకునిచ్చు టదియెల్ల కీర్తియగునె గాన సౌభద్రునకునేడు కన్యనిచ్చి, పరిణయము చేయు సంతోషభరితముగను,

వ అని యావ్యాధంబున బల్కిన విని బోధపడక బలరాముం డిట్లనియె.

బ-కందార్థం॥ మాధవనీవిప్పుడుబల్ బోధించుచు లేనిపోనిబుద్ధులు దెల్పక సాధులు పాండవులను టీగా ధలు బలుకంగనీకి॥ కపటంబు లేలా॥ యీచింతతో॥ తపియింపమేలా॥ ఈపాండవులు మన కెంతో బంధువులైతే। యేపునకురుపతి హెచ్చుబంధుడు గాడే॥ కపటంబు లేలా.

క, పరమాన్నము గుడిచినయా, నరునోటను చేదు కాయునమాలిన భంగిగా।
సిరిగలలక్షణుడేమన, తరుణీసరుడగునునరునితనయుండగునా.

కృ-వ. అనినకోపోద్దీతమానసుండై శ్రీకృష్ణుండిట్లనియె.

గీ. పాండుతనయులపై నీకుపంతమున్న, వనితనీకిష్టమైనట్టివాని కిమ్ము, యింద్రపవనజలిర్వురు యుద్ధమునకు గదియకురుపదిబాబు నీపాటు గందుగాక.

వ. అనిపల్కి సుభద్రనుంగాంచి తాలాంకుండుబల్కినపల్కుల స్వారస్యంబు దెలిసెగదా నీకు దిక్కుంగలచోటు కరుగుమని రథాంగపాణి తనమందిరంబునకేగె నాసమయంబున సుభద్ర శయనగృహంబు చేరి చింతింపుచు చెలులకిట్లనియె

౫ దరువు అట హిందుస్తాని తోడి.

చెలియానే పుట్టిల్లు చేరినందుకు చుల్కనైతి పలుచనైతి। చెలియా। బలరాముడెంతటిపాతకీ వాని దలచరాదె సర్వఘాతకీ వలుమారుసభలోను పట్టినిచ్చెదననిబల్కెనే। పల్కితొలగునే। చెలియా। ప్రాణేశునంత దూషించెను। గద! పట్టణనృపుని భూషించెనే। యణమాత్రమైనను తనయునిపై మతిలేదే యంతైన దయరాదే। చెలి। ముచ్చటగలకోడలనుచూ। జనుల్ మెచ్చగ నికనేమీయనుచూ। యిచ్చలోగలకోర్కె తెల్లబాపెను ద్రోహిబలుడు! యూ హాలధరుడూ। చెలి। ఈయెడ కటువలె బోదూ। నేపోవ టిత్రోవదిలేదూ। బాయకలింగాక్ష్య నాయునేలిన శౌరిరాడే। మము బ్రోవడే। చెలి.

వ. ఇట్లు చింతింపుచున్న సూర్యాస్తమయంబవుటయభిమన్యుండుతోడిబాలురతో నాడుచుండి భోజనసమయంబగుటయు మందిరంబునకుం జని చింతాకులచిత్తయైయున్న తల్లినింగాంచి యిట్లనియె,

అ–గీ. ఘనముగానిట్లు చింతింప కారణంబుగాన వనములమా తండ్రిగారివార్త చెవికి వినబడిన దాచక చెప్పవమ్మ, జనని నిదగుమనమిటు చెదరనేల.

తల్లీ యెవరేమనిరోయమ్మా। తల్లవాధరి చంద్రుతో సరిబోలు నీముఖమెల్లవాడిన। దుల్లములరగ దెల్పుమీయెడ। కల్లలాడక చల్లగనముగ। తల్లీ। తలయెత్తి చూడవదేమే తల్లీ। పలికిచెప్పవె కల్పవల్లీ। తలిరుబోణీ। యరణ్యమందున తండ్రులకునేమైనయాపద గలిగియుండిన దెలుపుమీయెడ తలపునను సంశయంబేలను। తల్లి। వామరులెవరే మియినయునిరా। మామలుమనల నిందించిరా। సీమమెరుగక నిన్నుదూరిన బూమిలో నెవరయినవారల। ధీబలంబున ద్రుంతునిప్పుడు। నామదికి సమ్మతిగ దెల్పవె॥ తల్లి। చింతగల్గుటలేలానమ్మ। సంతసమందుచునుండవమ్మా। వంతగుందగవలదు బోంతా। వంశశ్రేష్ఠుడైనలింగయ। సొంత మాత్రము బాయగలేదు। కంటుజనకుడు గలిగియుండగ తల్లి,

వ అనిపల్కిన కుమారునకు తల్లి యిట్లనియె.

సు–క, తనయానే నెరుగనుమీ, జనకులజోలెలవినుము జనపతిబలుడున్

ధనమునకావహించుచు, ఘనముగ వన్నతంబుబల్కె కపటహృదయుడై
ను దరువు ఆది.

నీతో యేమందునురా। తనయా। నీతో। పాతకుడు బలరాముడు నాతిశశిరేఖనిటు। నీతిలేక దుర్యోధనసుతునకు నొసంగును। నీతో। ఇన్ని నాళ్ళనుంచి నీ। నన్నుతాంగి శశిరేఖా। నన్నాకోర్కెలన్ని బోయె కన్న తండ్రియొటులోర్తురా। నీతో। బలవంతుల వియ్యంబును గలవారితో వియ్యంబును। కలవారము మీతో పొ దు గలయు వీలుగల్గదనె। నీ। యెంతా వేడియడిగినను। వంతముతో గాంచినను। యింతినీదుచుట్టరికం। బింతెచాల్ వెళ్లుమనె। నీతో। ఎందూకిక సందియము। పొందుగాదు మీకుమాకు। కుందరదన మఱ్ఱిగుంట। కృష్ణుసాటి యివ్వననె। నీతో.

సు-క. శుభగాత్రనయుడుగాడిక, యభిమన్యునకివ్వననుచునాత్మజవిపుడుణ్
ఇభరాట్పురివరుడగుకురు విభుసుతుడగులక్ష్మణునకునిచ్చెరతనయా.

సు-వ. నేటికెనిమిది వాసరంబులకువివాహలగ్న మేర్పరచినాడని చెప్పగా కోపోద్దీపితమానసుండై యిటులనియె.

అ-క. జనని బలరాముపల్కులు, వినుటకుకర్ణద్వయంబు లిప్పుడుగట్టెన్
గనుకను శౌర్యముగలనీ తనయుడనీకుండనేమితరుగికజెపుమా.

అ-సీ. ఇదియునుగాక యుద్ధమునవీరుడటంచుప్రసిద్ధిజెందియున్
పదియునునామముల్బడసిఫల్గునుడుంచని ప్రజ్వరిల్లెడున్
సదయుడునీకుగల్గగను సర్వదచింతల కెంతమాత్రమున్
కొదవమనంబునన్ వలదు గొప్పతనంబున నుండగా దగున్.

అ-దరువు-ఆది-సురట.

జననీ లేవమ్మ। ఘనముగానువనముకువెళ్ళవలె। జన। పనికిమాలి మజ్జనకులందరిని। వనగిరులందున మననమిడుపించియు వనజదళాక్షుని యనుమతిబెంబడి జనియుద్వారకకుచేరిఫలము। జర। కన్నవారియింటాశ చేత నీవున్న వేమొ మదినెన్నవలదు బలుడన్నమాట లన్నిదప్పి మనలను చిన్నబుచ్చె కన్నుగానకను। జన। దండిశూరులని పాండునందనుల యందచేరి బ్రతికుండగవలదరు। డొందుచోటుగోరుండెవాచి ఖండించి దండధరునందచేర్తు। జన। ఎంతమాత్రమిక చింతవలదుయా। దంతిగమన

శశిరేఖ నివ్వడిక చెంతనుయదువరులంత గూడిబూకాంతుని బ్రోచిన ద్రుంతునిచము। జన। భాసురముగ శ్రీమట్రిగుంటపురి। వాసుడైన జగ ధీశుని గుడిలో। లేశమైనమరి మరువక ధ్యానముచేసిన దోనము తీసి వేయు। జన.

అ-క. మురహరియు సాత్యకరయుగ, ధరగూల్చెద బలునిఘడి యతడ వుంచకయుః, నరుపుత్రుడ నెడునామం, బరువడి గలుగంగ యేనుపంతమిడుదు నే.

వ. అనిధనన్సును శరంబులుబూని యెర్రని నేత్రంబులతో వెడ లె నెటులనిన,



అ-పంచచామరం. దండికోపమునను పాండుధారుణీశుపౌత్రుడః
భండనంబు నందబలునిబట్టిద్రుంచి యాదవులు
పిండిచేసికౌరవులను భీతితోడయమునపురిః
మండునటులచేతునింక నర్వాహాడవిప్పుడః.

వ. ఇట్లులేచిన సుభద్ర గడగడవణకి కుమారునికిటులనినె.

సు-ద్విః. బలుడుతన్నాడిన పల్కులువినియు కలవి లేనివికొన్ని కాగులుబన్ని కోమరొప్పసుతునకు కోపముగబోసి - రమణమీరంగ బల

రాముని చంపి-రమ్మని బంపెయా రవిమిత్రవంశ-నిమ్మహిసుభద్ర యని
డుగయ్యాళి-యనియందురవనిని యపవాదమేల-గనుక యామునలినను
కఠినమాడుటయు-కాలవిశేషంబు గనుము నాతనయ_బాలుడవటగుంట
పతిని మరువకుము.

వ. తల్లివాక్యంబులు విని హస్తి కంకుళంబుజావు తెరంగున
వణగి మేనమామపైకి బోవుటమాని తల్లికిట్లనియె.

అ-కందార్థం॥ బలరాముడాడుమాటలు। కలికీనీకిష్టమైన కాదను
కేలన్ । నిలువుము నీవీపురమున । వలనొప్పగ నేచూబోదు। వడిగనూ।
జనియెడతండ్రికడకునూ॥ గడియయినను నాయుడుగిడనిచ్చుట। బిడౌజ
తనయుని పొడగనవలె నిక॥ వడిగనూ॥

వ. అనిపల్కినతనయా నినువిడనాడి నామనంబు నిల్పంజాల
గావున నన్నునుదోడ్కొని పొమ్మనిన అర్ధరాత్రి వేళ జననిందోట్కొని
మహారణ్యము ప్రవేశించి శరభసింహ శార్దూలాదిమృగంబుల చూచు
చుసుభద్రాదేవి నడువజాలన కుమారున కిట్లనియె.

సు-దరువు-అట-యమునాకల్యాణి

అడవులలోమనము నడచిమితంత్రుల। కడకుబోగలమా తన
యా॥ బడలికతో ప్రాణ॥ మొడిబడెనడుగులు। తడబడెనయ్యో తనయా
అడ॥ రాళ్లుడాకి కాళ్ళ గోళ్ళలో రక్తము వెళ్ళబారెను రా తనయా। వాళ్ళ
చెమటగట్టె కళ్లుగాదు త్రాగ। నీళ్ళులేనిచట తనయా॥ అడ॥ ఘనముగ
బాంతాళింగానాయనేలిన వనమాలి ప్రతేదె తనయా। మునుజన్మ
ఫలమిట్లు నా ... చుమన చు। ... గను ... న్నా సెతనయా॥ ...డ॥

వ ... చింతి ... పుచున్న త ... ధై ... ంబు జెప్పుచు పోవుచు
మరియును,

అ-క విల్లును శరములు తొడుగ, తల్లిని దోట్కొనుచు బోవు
తరితనతండ్రుల్, మెల్లగనుండిన మార్గం, బెల్లం గనలేక విపినమే ది
క్కనుచున్.

వ. ఘోరకాననంబున బోవుచు నదులు దాటుచు.

అ-కందార్థం॥ కరిసింహవ్యాఘ్రనూకర। వరభల్లూకాదిరవము

వాసవిపౌత్రుం। దురునడివినుచుందనుముచు గ్రురుతుగమరినడచుచుండె సరసుడా। రణశ్రేష్ఠుడైన పురుషుడా॥ తరుచుగజననికి ధైర్యముదెల్పుచు। సరవిమూడు దివసంబులు యడవిని॥ సరసుడా॥

వ. ఇట్లుమూడుదివసంబ్బులు నడచి మూడవనాటిరాత్రి ఘటోత్కచు వనంబుజేరిన సుభద్రాదేవి నడువంజాలక శయనించిన తల్లినింగాపాడుకొరకు అభిమన్యుండు,



గీ. జనని రక్షించుకొరకునై ధనువుబట్టి, గుణముతీడిన తధ్వని కొండలందు. బధులుధ్వనులిచ్చె పట్టీలు చదలబరచె, నట్టిరవమున కులిక్కిపడె నసురవరుడా.

ఘ-వ. ఇట్లులిక్కిపడిలేచి ఘటోత్కచుం డిట్లనియె.

గీ అవనిమర యక్షరాక్షసు లంతవారు, చొరగజాలరు నావన మొచ్చిరేని, మరణమును సిద్ధమనుచు చాపంబు శరము, లురువడిగ దాల్చి వెడలెను రూఢిగాను.

ఘటో-దరువు-ఆది-నాట

ఘటోత్కచుడువచ్చెగా అభిమన్యుడుండు అటావికడుజొచ్చెగా॥ ఘటో॥ బటూవృదంతాల్ పటాపటాగా గొరి। కిటాకొచ్చినవాగా గుటుక్కునమ్రింగుడని॥ ఘటో॥ దండిగకండ లుద్దండమునమలి। మెండుగ నాకడుపు నిండామెక్కుదునంచు॥ ఘటో॥ గరిమతోలింగొఖ్యువరదుని సత్కృప। నిరతముండినపొట్ట నిండభక్షింతునని॥ ఘటో॥

ఉ. ఎవ్వడవీవు నావనము కేమిభయంబును లేక వచ్చియుం
ద్రొవ్వియునర్ధరాత్రి నిటకొచ్చుటకుం దేల్వొంటగృహమునన్
దవ్వులుబోవనేరనటు దక్కితివిప్పుడు నిన్నుద్రుంచెదన్
రివ్వునవచ్చుబాణముల రీతియెరుంగవె మానవాధమా.

అ-క. ఏమిర యుద్ధముచేసే, సామర్థ్యుడనంచునాతో సాటెద వౌరా, దీమస సమరము జేయుము, యీమహి పెగమాట లేలయిటు రా వేలా.

ఘ-కందార్థం॥ యుద్ధము జేయగమానవు। డిద్ధరనిటనొచ్చిమరల నేగంగలడే। బుద్ధియులేని నరాధమ। ముద్దగకబళించినిన్ను॥ మ్రింగుదూ భువిలోన కడుచెలంగుదూ॥ నింగికినెగసిన నినుబోనియ్యక। భంగము జేయుచు పటపటనమలీ॥ మ్రింగుదూ॥

వ. అనిన యభిమన్యుండు ద్విరదంబు గాంచిన సింహంబుకర ణి యుగ్రుండై యిట్లనియె.

సంవా-దరువు-ఆది-నాట.

అ॥ దురహంకారము లేలరాతక్షణమే నిన్ను బరిమార్తునిదుగో చూడరా। కరిమృగరాజైప్వ కురికినకరణివు డరుదెంచితివవురధమరాక్ష సుడ॥ దురు॥ ఘ॥ మనుజాధముడమానరానా యెదుటనిలచి మొనగాడ ననుటయేలరా। ఘనపర్వతమునుగాంచియు తగరొడి పనివడి డీకొను పగనున్నదిక॥ మను॥ అ॥ రాక్షసాధమ వినరా నన్నునీవు బట్టిభక్షించె వాడవటరా। ఈక్షితినగమున క్రిందశరముపగిదీక్షణమునద్రుంచియుమ పురికనుపుదు॥ దుర॥ ఘ॥ ఎదిరించిపల్కవే రా భయమింతలేక వద రుచెందుకుమానరా, వదలక నాడగు పదునగుశరములమదమణగించె ద కుదురుగనిల్వర॥ మను॥ అ॥ గప్పాలకూతలేలరా వడిగయుద్ధము నకు వచ్చినందుకుమెస్తిరా। ఇచ్చటచప్పన లెంమకురమ్మిట గృచ్చివ ధించియు కుంభినిద్రోచెద॥ దుర॥ ఘ॥ ననుబోరనేర్చువాడవా నాశర జాలంబులును తాకినపుడు తెలియువా। ఘనసుగుకార్ముకధ్వనికిని నిల్వ నిమనుజాధముడవు ననుగెలిచెదవ॥ మను॥ అ॥ బాంతావంశాబ్ధిచంద్రు

డౌ వరలింగాహ్వాయుని సంతరించెదు శ్రీకృష్ణుడా। పంతముతోనిను బట్టి వధింపను యింతలోబంపించెదు నిచటికి॥ దు॥

ఘు—కందార్థం॥ వినరోరిమానవాధమ। నను గెల్వగ లేరుసురులు నరులకువశమా। పనిమాలి వృథాజల్పము। లనుబల్కకుమిది గొనిన్నా దునిమెదా॥ నీధైర్యశౌర్యముల్ గనియెదా॥ ఘున మగుబాణమునను సంధించితి। డనలుచునిమ్మడి గాల్చునరక్షణమున। దునిమె.

వ. అనివైచిన బాణంబును ఖండించి నాగాస్త్రంబు బూని అభిమన్యుం డిట్లనియె.





అ—కందార్థం। దేవారియాశరంబున। కేవలసురణంబుజేయ కేవిన్నిడువక। చావుకుదెగినిటకొస్తివి। గావుననాగాస్త్రమిదుగో గ్రక్కునా విడిపించితిక నీడొక్కనా। తక్కకసీల్చియుముక్కు మొగంబును। చెక్కియు కంఠము చించిద్రుంచు నిక। గ్రక్కునా.

వ. ఇట్లేసిన నాగాస్త్రంబు లెక్కింపక ఘటోత్కచుండు.

ఘు—కందార్థం। బాలకనీవేసినశర। జాలంబులుసన్నునేమిసేయుం గల్గుక। కు లుతుకుంభినిలోనక। చాలగగరుడాస్త్రమిదుగో సరగునా। జనుదెంచేచూడుమా వరుగునా। గురుతుగ గగనము కరిగినవిడువక। సురలరయగ నీశిరము ద్రుంచుకదు। సరగునా.

వ. ఈవిధంబున పోరు నెడ నిరువురులశరీరంబుల దొరుగురుధిరంబు మడువులు గట్టి ప్రవాహంబులు బారెనపుడు.



క. యుద్ధముచేయుచుమరిదా, రిద్దరునొక్కరైన వెరువ కిద్ధరవణకన్.
సిద్ధముగ మోహరించుక, తద్దయుసమరంబు జేయు తరితామసులై.

వ. బెబ్బులులచందంబున బోరిపోరి హైడింబుం డబ్జభవాస్త్రింబు దొడిగినంజూచి సౌభద్రుం డదియె సంధించె నాసమయంబున కులాచలంబులు చలించె రవిచంద్రులు మార్గంబులుదప్పి రమరులు భయాకులచిత్తులయి రపుడుత్రికాలవేదియగు వేదవ్యాసుండువచ్చియుభయవాదులమధ్య నిలిచి యిట్లనియె.

వ్యాసు-దరువు-ఆది,

ఓభీమపుత్ర ఓపాకశాసనపౌత్ర। వో భీ। యీభువినిట్టి యస్త్రాల్ విడువబూనుటచిత్ర। మో భీ। అనవిలో మామా అన్నదమ్ములుగారా కవురవుల్కొడిజనకుల్ గహాసమునందుడు జెరుగారా। వో భీ। మీలోనమీరూ ఆలము జేయాపగవారా। చాలగా వే వ్విమిపుడూ జేతురు చలమింకిడుడు వో భీ। శ్రీమట్టిగుంట శ్రీశుడెపుడుమీవెంట। ప్రేమతో బ్రోచుచుండు భేద మిడిపించిరండూ। వో భీ.

వ. ఈవిధంబునం జెప్పి మాసింద్రుం డరిగిన ఘటోత్కచుండు అభిమన్యున కిట్లనియె.

ఘ-ద్వి. ఓరితమ్ముఁడనీతో వడిగయుద్ధంబు-నేరక జేసితి నెరుగ నిజంబు-నునిశితాస్త్రము వేసి నృక్కించినీదు-తనువునరక్తంబు ధర ధారచేసి-తిని మనజనకులు నినినమన్నింప-రనుజనిన్న రసిననంతమాత్ర మున-రమ్మనిబిలువక రణముచేసితిని-తమ్ముఁడనే కిట్లు తాళియుండుదు ను-శ్రీమఱ్ఱిగుంటపురీశునికరుణ ప్రేమతో లేకనే పెల్వమతినయితి.

వ. ఇట్లు చింతించి ఘటోత్కచుండు పినతల్లి పాదంబులపైబడి యిట్లనియె.

ఘ-క. జననీ యడవికిమీరలు, జనుదెంచిన కార్యమేమి చయ్యన నాకున్, వినిపింపుము ఘనకరుణను, తనయుఁడ నేనుండ నీకు తరుగిక వలదూ.

సు-దరువు-అట-యమునాకల్యాణి.

తనయ నీవిపుడువినుము దెల్పెద। కనికరముతో మమ్ము బ్రోవుము నాయనా। యిటకొచ్చుసంగతు లేలనా। తన। ౧। బలుడునా తనయునకు పట్టిని పరిణయముగావింతు ననుచును। జెప్పెనూ। నామది యొప్పెనూ। తన। ౨। కొన్నిదినములు జరగగామీ। కన్నతండ్రులు కౌరవులతో జూదమూ। లాడియును విడచిరాజ్యమూ। ౩ పతిని బాయక నడవిలో సౌభద్రునితో మేముండగా బలరాముడూ, పంపినను జని శ్రీకృష్ణుడూ ౪ బావమరుదులగాంచియును సంభాషణములొనరించి ధైర్యము జెప్పగా। సంతసముతో మముబంపబు ౪ తనయుడవు సౌభద్రుడును నే తర్లి ద్వారక పురికి చేరియుచల్లగా బలరామునింటను మెల్లగా ౫ ఇట్లులుండగ సుత నుకౌరవ పట్టికిచ్చెదననుచు సభలో గట్టిగా జెప్పియును వడిచల పట్టగా ౬ ఎన్నివిధముల వేడినుతునకు కన్ని విన్నమటంచు మ్రొక్కితి భక్తితో పోరాడితిబలశక్తితో ౭ అన్నహీనులు సన్నశౌర్యుల కన్నగా శశిరేఖ నివ్వను పొమ్మనీ దుర్భాషలాడెను లెమ్మనీ ౮ లింగయార్యాయు నేలు గరుటతు రంగుననిశము నమ్మియడవికి వస్తిమీ చింతి స్తునిన్నటుజూస్తిమి

వ. అనిపల్కిన ఘటోత్కచుండు కోపంబున నిటులనియె.

ఘ-సీ. అడవిని మా జనకులన్న రహితాత్ములై యుండ దుర్యోధ నుడుర్వి యేలు, చుండు వానినిద్రుంతు చూడుము న్నాప్రతినబలుడుబల్కిన పల్కు ధలమునతని, గుడిపి శశిరేఖను గొబ్బున గొనితెచ్చి దశమికీల గ్నంబు తగనొనర్చి, దంపతులనువాడు తంద్రులకడచేర్త సంతోషము నను యోజపని యిపుడు, మనకుపగవారలయి నకురుపతులగర్వమణచి వారికిపతు దుర్మతులద్రుంచి, నిమిషమాత్రంబునే తెంతు నిశ్చయముగ యిమ్ముగా మామకృష్ణుండు యిచ్చుజయము.

వ. ఈవిధంబున సుభద్రాదేవికిచెప్పి ప్రయాణోన్ముఖుండై యుం డగా నచ్చట శశిరేఖ చెలులకిటులనియె.

శశిరేఖ-దరువు-రూపకము.

కాంతలార జనకుడా భూకాంతుడిప్పుడూ కా కుంతిపౌత్రు నెం తలోవనాంతరమున చింతిలుమని పంతమునను బంపించెను కా మదన మోహనాంగుని నేమరువజాలనే పదమలాంగులార ధవుని మదిగరుగగ ముద మొదవగ సదయునినను సమకూర్చరె కా అంతరంగమునను వాని చెంతచేర్చరే బొంతాలింగయాఖ్యార్చితు నిరంతరమునను యింతనము ననంతసమెద స్మరియించెద కా.

ద్వి. వినవమ్మ జెప్పెదవిశదంబు గాను-వనమందు నభిమన్యునొం టిగాజూచి-దదిమొదలిభుడో నటుంచునమ్మితిని-సుదతిరో యుతరపురు షుని గోరదగునె-బలుడుతండ్రిని నేను బహుసంతసించి-ఇలనుపగవాడ నుచు పరుంగనై తి-పాపిష్టికురురాజుపట్టికినన్ను-యేపునరివ్వంగ నేర్ప రచినాడు సౌభద్రుడునునాకు సఖుడుగాకున్న-యీభువిలోనింక నెట్లో ర్చియుందు-మరుడుబాణములేయ మదిరోచదాయె-మరి చిలుకలుగూ యు మరలు హెచ్చాయె-తరణిమిత్రుని వేడి నాపరమాయె విరహాగ్ను లమాయె వెలదిజాగాయె-అభిమన్యు జడబాసి యరనిమిషమైన-యిభ రాజగామిని యికనోర్వలే న-న్యగ్రోధపురిహరుని నేర్పునదలచి-శీఘ్రమే విభు నిందు చేర్పరె చెలియ.

శశి-దరువు-అట.

ఇదియేమిమాయ యిందు రాదాయె యి సదయుడు బోయెమది

దోచదామె గు మేనత్తపుత్రుడని మేలనినమ్మితిని నానోముఫలమే మని నరయుమకామినీ యి గరిమతో బాంతాళింగాహ్వాయు నేలిన గు రుతుగ శ్రీన్యగ్రోధ గుంటను హరియెరుగడె యిది.

ఉ. ఉత్తముడైనతండ్రి మదినొప్పియుపుత్రుని వేట్కతోడుతన్
పెత్తనమిచ్చుకాలమున పెద్దలుపిన్నలు బంధువర్గమున్
చిత్తములొప్పవాని భువి చేతురుపెండ్లియునేటి వార్తలున్
యిత్తరిదల్పకుండుటలు వేనొనరించు ఫలంబు చూడగన్

క. ఎవ్వాడు దుర్యోధనుడను, డెవ్వాడులక్షణునిదలపు డెక్కడిబంధుల్
కవ్వాడితనయుని మరియున్, నివ్వసుధననమ్మియుంటివిభుడనుకొంటి

శ-దరువు-అట.

అమ్మ యెటులచేతునె విరహమ్మునెటులాదాతునె వోయమ్మ నమ్మతిగ యభిమన్యుడవుడు కొమ్మరమ్మనిబిలచునే అమ్మ చక్కెర కెమ్మోవిపంటచుగ్కన యెప్పుడునొక్కనేమక్కువతో రతికేళి యెవుడు అక్కరనుసొక్కించునే అమ్మ గరిమతో లింగాఖ్య వరదునికరుణయెవు డుగల్గునే నిరతముచుయభిమన్యు పెనగియుసరసమాడుటలెన్న అ.



గీ. ఇంద్రపౌత్రుని తోల్ధనావిభుడటంచు. మదినినమ్మితినితరుని మగనిగాను, యెంచిబ్రతికినఫలమేమి యట్లగాదు, విడుతు ప్రాణంబుదా టినీ ట్వెషముతోనూ.

వ. అట్టిసమయంబున నారదుండువచ్చి యిట్లనియె.

నార-ద్వి. చానరో యిటువంటిసాహసంబేల మానుము యభి మన్యుమగనిగానీకు వాణీపతి మొదలనేవ్రాసియున్నాడు చానరో నీ విట్టి సంగతెరుగకను చింతింపుచున్ననీ చింతనుమాను దంతిగమనివివా హాతరుణాభిమన్యు చేరెదవటగుంట శ్రీకృష్ణకృపను దారుణిసౌఖ్యంబు తగగందు వబలా.

వ. అని నారదుండెరిగించిచనిన యనంతరంబు శశిరేఖసంతో షసాగరంబునం దేలుచు సఖీజనంబులతో నాడుచుండె నాసమయంబున,

వ. తదనంతరంబున అరణ్యంబున ఘటోత్కచుండు

ఘ-పంచచామరం ధరాతలంబొణంగపాదతాడనంబొనర్చిబల్
ఝరానలేచి తల్లి సెల్వొజెంది యాకసంబుకున్
సరాశమందు బోయువేగ సంతలోన ద్వారకన్
బిరానజొచ్చిచూచె నంతభీమనందనుండటన్.

వ. ఇట్లు పురంబుజేరి వర్ణించి విరోధులంగాంచి ద్విరదంబుం గాంచుసింహంబుకరణి నెంచుకొని గూఢవృత్తిని శశిరేఖనగుజొచ్చి శశిరేఖనుగాంచి తనమనంబున,

ఘ దర్వు ఆదితాళం.

ఇంతసుందరమయినా। యింతినెచటనేగానా॥ ఇ॥ ఇంతినిటులెటా నిర్మింప। చెంతకష్టించెనో బ్రహ్మా॥ ఇ॥ ఎమ్మెలాడికినాదూతమ్మైనా సౌభద్రూ। డమ్మరురతికిపమా సమ్మనిపుదెకిదోచె॥ ఇ॥ ఇట్టియువతిని నేనేపట్టునడవిశేర్తు। గట్టిగాగెత్తునని సరుసట్టితోబల్కితప్పుడూ॥ ఇ॥ అనుజునినారీ దీనితనువునముట్టుటహాని యనుచు నెరిగుండి నేనీ వనితనె టులతాకుదు॥ ఇ॥ పొంచులుండిమచ్చుజల్లి మంచముతో నెత్తుకవెళ్ళి। చంచలాక్షునిత్వరలో నుంచెదనావనమిాలో। ఇ॥ ఇంతకు యోచన లేలా బొంతాలింగావ్వాయునేలు। కంసుజనకుడై నశౌరి గల్గగాను నా సరియేరి॥ ఇంత॥

వ. ఇట్లుయోచించి చంద్రరేఖపై మచ్చుజల్లి మంచంబు శిరం

బునిడుకొని మాదోపాయంబున వనంబుజేర్చి సుభద్రాభిమన్యుల గాంచి సుభద్రకు కిటులనియె,

ఘ-గీ, తల్లినీయాజ్ఞచొవ్వన తల్లిద్వార, కాపురంబున కేసరిగి కంజనేత్రి, పైనవడిమచ్చుజల్లి తలపైమంచ మెత్తుకొని వేగ దె_స్తిని మెలత నిటకు,

వ. అంత సుభద్రాభిమన్యులు ఘటోత్కచుని సాహసంబునకు సంతసింపుచున్న శశిరేఖ నిద్రమేల్కాంచి సుభద్రాభిమన్యులంజూచి సిగ్గును భయంబును సంతసంబును బెనంగొన అత్త కిటులనియె,

క-క, ద్వారకనగరంబెక్కడ, కోరికపూశయ్యపైనిగూర్కడ లేడక
ఘోరారణ్యముచేరీ, తీరున నేనుండు టేమొ దెలియదునాకుఁ.

## శ దరువు ఆదితాళము

ఎవ్వరుదెచ్చిరి యివ్వనభూమికి। కవ్వడిసతిదెల్పుమమ్మా॥ పువ్వులుకానిసాటి జోలినసౌభద్రు। కివ్వనిబలుక్రొవ్వణచను। నివ్వసుధను నెవ్వరుగల॥ ఎ॥ అంతమైనట్టి హేమమందిరమునవిద్ర। జెందియుండు టేమెరుగునమ్మా। ముందుగా నాకుదెల్పా నందునడెందమందు। నందియమై తొంటరపడి తిందుకు మతియందల్లరు॥ ఎ॥ గరిమతో న్యగ్రోధపురివరదునిమది। మదువకధ్యానింతునమ్మా। కరుణనాయెడలేదో గలిగియున్నదోమది॥ నెరుకమరివెరచితి తరినెరిగింపుము। కరుణింపుము॥ఎ॥

వ. అని పల్కిన సుభద్ర యిటులనియె,

ను-ద్వి, ఇలుబాసిపస్తిని విపినముకనుచు-దలపకుభీమునితనయుడై నట్టి-ఘనమైనయాఘటోత్కచునిని(య)యంబు - మననిలయం బంచు మదిలోననెంచు-యించుకశకెంచ కెలమిమీభావ-మంచముతో నిన్ను మాకడజేర్చె-నభిమన్యునకునీకు నమిరవివాహ - మిభవంబుతో జేయు నేర్పరచినాడు-గాననీతలిదండ్రి గారినిదలచి మానుగాచినశ నీమదివల దమ్మ- యెల్లుండియూరికి వేగబోదాము-యుల్లంబులోకోర్కులున్నట్లు దెల్పు - వటగుంటపట్టణ వరదుడౌశౌరి - పటుతరంబుగను మనపాల గలడమ్మా,

వ. అనిపల్కిన శశిరేఖ సంతోషంబున యేకమనస్సుతో అత్తకు నమస్కరించి యిటులనియె.

శ-క. గట్టిగ బాల్యంబున నీ, పట్టిని పెండ్లాడుకోర్కె బహుగ గ్లైనునా
వట్టిజనుడువులుయనిమదిఁ బెట్టకుహరిసాక్షి నమ్ము బెంపుముసుమ్మా

వ. ఈపల్కులువిని ఘటోత్కచుండు సంతోషభరితుండై గగనంబునకెగసి మహారణ్యంబు గడచి ద్వారకానగరంబుచేరి శశిరేఖయాకారంబుదాల్చి మాయామంచంబు గావించుకొని పవ్వళించియున్న విధం బెటువలెనూ.

ఘ,ఉ. చక్కని పెండ్లికూతుకని చాలగనందరు జూమచుండగన్
మక్కువదాదివారు బహుమాటలుజెప్పిన మారుబల్కకన్
ముక్కరమీదదృష్టి నిడిమోమునునొత్తక ముగ్ధరీతిగన్
యెక్కువసిగ్గుగల్గు చెలియామణిబోలియు సంతసించుచున్.

వ. ఇట్లున్నసమయంబున బలరాముండు బ్రాహ్మణులఁబిలిపించి



గీ. భూసురోత్తములార యిభపురముకేగి. ఘనుడుదుర్యోధనునింగాంచి తనయుతోన తల్లిరమ్మనిపల్కుడు తడవుసేయ, వలదులగ్నంబు దాకొనివచ్చె ననుడు.

వ. ఫాల్గుణ శుద్ధదశమి సౌమ్యవాసరంబు ఉదయలగ్నంబునిశ్చయంబు జెప్పిరందు యీప్రకారంబు జెప్పిపనిచిన దుర్యోధనాదిబంధువర్గంబు వచ్చుచున్న బలరాముండు చారుల కిటులనియె.

బల దరువు అట సౌరాష్ట్రి.

ద్వారకాపట్టణ నృపుడూ। పరిచారులతో బల్కెనపుడూ॥ ద్వార॥ ధారుణీసురల॥ తొందరగాబిలచి శశి। తారలనడిగిసుందరులరప్పించు డని॥ ద్వార॥ ఆర్యులపిలుపింపుడిపుడూ॥ మంత్రివర్యుల వేగరమ్మను దుర్యోధనుడుపెండ్లికార్యమునకు సుతుని। సర్వజనులుచూడ చనుదెంచర్ధులు వేడ॥ ద్వా॥ ఎదురుకోళ్వాయె మనకూ। వారికెదురుగ నరుగుదెంచుటకూ। కుదురయినరథములు కుంజరాశ్వములెల్ల। వదలకశృంగారమొనగూర్చుమని వేగ॥ ద్వా॥ అంగనమణులంద రొడిగా బాగా। సంగీతములనుబాడిగా। లింగయాఖ్యునిబ్రోచు। సంగీతలోలునికి। సంగతిదెలుపక। జరుపుకొగలసంచు॥ ద్వార॥



వ. ఇట్లు బలరామమూర్తి సకలవస్తువులను గూర్చుకొని సకల బంధువులతో నెదురుచూచుచున్న సమయంబున.

దు-శ. మానుగపట్టణనృపవరు, డేనుగుపైనుతుని జేర్చి వేట్కలరంగ

వ. ఫాల్గుణ శుద్ధదశమి సౌమ్యవాసరంబు ఉదయలగ్నంబునిశ్చయంబు జెప్పిరందు యీప్రకారంబు జెప్పిపనిచిన దుర్యోధనాదిబంధువర్గంబు వచ్చుచున్న బలరాముండు చారుల కిటులనియె.

బల దరువు అట సౌరాష్ట్రి.

ద్వారకాపట్టణ నృపుడా। పరిచారులతో బల్కెనపుడా॥ ద్వార॥ ధారుణీసురల॥ తొందరగాబిలచి శశి। తారలనడిగిసుందరులరప్పించు డని॥ ద్వార॥ ఆర్యులపిలుపించుడిపుడా॥ మంత్రివర్యుల వేగరమ్మను దుర్యోధనుడు పెండ్లికార్యమునకు సుతుని। సర్వజనులుచూడ చనుదెంచరులు వేడ॥ ద్వా॥ ఎదురుకోళ్వాయె మనకూ। వారికెదురుగ నరుగుదెంచుటకూ। కుదురయినరథములు కుంజరాశ్వములెల్ల। వదలకశృంగారమొనగూర్చుమని వేగ॥ ద్వా॥ అంగనమణులందరాడిగా బాగా। సంగీతములును బాడిగా। లింగయాఖ్యునిబ్రోచు। సంగీతలోలునికి। సంగతితెలుపక। జరుపుకొగలనంచు॥ ద్వార॥



వ. ఇట్లు బలరామమూర్తి సకలవస్తువులను గూర్చుకొని సకల బంధువులతో నెదురుచూచుచున్న సమయంబున.

దు-శ. మానుగపట్టణనృపవరు, డేనుగుపైసుతుని జేర్చి వేట్కలరంగ

దామో-గీ. మతిరహితులగుచు కౌంతేయులితనినమ్మి విత్తివీగ జరదిమాన్న వేళగనుక హారినిచేకొని కృష్ణసాత్యకుల నెల్ల, వరుసపాలిమేర దాటింపవలయునిపుడు.

వ. ఇట్లు గుసగుసలాడుచున్న సాత్యకివిని రోషపడి ధృతరాష్ట్రపుత్రుల వధింతునని లేచిన వామదేవుండరసి తన్నూడ్చా పాండవులు చేయుప్రతిన నీవెరుంగవే యిదియునుంగాక,

కృ-క. ఘడియకులోగాకౌంవులాడబడిబిడియంబుపొందిలోభత్వముగ

అడవినిదరిలేకెల్లె, వడువును వీక్షించవయ్య వానవశిష్యా

వ. అనిపల్కిన కోపంబుడిగి శినివరుండు ఆయుధంబు వరయందు చేర్చియుండె, నా సమయంబున అట్టియెడ సుయోధనుని పౌరోహితులత్యంతసంతోషంబున లక్షణు నుచితపీఠంబున నునిచి బ్రాహ్మణులు వచ్చి మంత్రోచ్చారణోన్ముఖు లగుచు నియతోపచారణంబు లొనరించి కన్యకామణిని రప్పింపు డనిన విని చెలులు మాయశశిరేఖకడకు జని యిటులనిరి.

ముత్తయిదులదరువు ఆది ఆనందభైరవి.

శశిరేఖరమ్మా స్నానామాడనూ। మంచిదశగల్గినట్టివరుడూ గూడెనూ। వానివశమైన నీదుపుణ్య। వశమూ నేమనవచ్చు॥ శశి॥ రాజూలకెల్ల మేటిరాజటా। గొప్ప తేజీనెక్కియువచ్చినాడటా। యీభూజనులకు కల్ప భూజము సరియౌనట॥ శశి॥ భోగాలవారు ఆడుతారట సొంపు రాగంబులును బాడుతారటా మంచి నాగరీకపుదక్షిణాది పాఠకులొచ్చారట॥ శ॥ అడవికభిమన్యు డెటువెళ్ళినాడట। సుభద్ర కొడుకూవెంటనే పోయున్నాడట బలరాముడునీకు పెండ్లిచేయు ముచ్చటతోయున్నాడట॥ శశి॥ నీదూపినతండ్రిని బిలువలేదడ। శ్రీన్యగ్రోధాపురమేలుకోమన్నాడట। యిపుడు మదవతిలెమ్ము లగ్నమాసన్నమైయున్నాదట॥ శశి॥

ద్వి. నీ ముగలక్షణుడు నీదుమగడంచు-నజుడువ్రాయగ మదికనుమానమేల-సిరిబాసియడవుల చెట్టాకుదినుచు పరదేశియైయున్న పార్థునిసుతుని వరియింపదగునటే వనరుహానేత్ర తరుణిరోసీవు చేయుతెప

మెన్నదర మో-మదనునికన్నను మహాసుందరుండు మదపతిలక్షణుడు మగడయి తేఘనము-పురుహూతునకు సరిబోలియున్నట్టి - కురురాజునకు ముద్దుకోడలవయ్యే-మరువకు మామీద మదిలోనకూర్మి గురుతర శ్రీ మత్రిగుంటపురిజనులు-నిన్ను మెచ్చెదరమ్మ నిజమ గామమ్మ - మన్నించి లేవమ్మ మల్లిపూరెమ్మా.

వ. అనిల మాయాళశిరేఖ,



దరువు అట మధ్యమావతి.

ధృతరాష్ట్రసుతుడు మామయి తేయతనిసుతుడునా ప్రాణేశుడై తే

ధృ॥ మతిదీర పెండ్లాడి మహిమీద బ్రతికితె అతివలార మిమ్ము నంతమొందించేను॥ ధృ॥ తాలాంకుడజుడు హరుడయినా। మాతలవ్రాతిక ద్రోక్క నాన। అలివేణులీక్షింప అత్తమామలబట్టి। వలపుదీరగ పాదతాడన మొనరింతు॥ ధృ॥ గరిమతో బొంతవంశమునా బుట్టి నిరతము ఘనకీర్తినున్న। సిరిగలలింగాఖ్యవరదునికృపనాపై। మరిగలిగినమిమ్ము బట్టిమడమొనరాయ॥ ధృత॥

వ. ఇట్లుబల్కిన చెలులందరు భయంబునొంది తల్లి నీవలుగ వలదుకళ్యాణవేళయైనది మీతండ్రికి కోపమువచ్చును లెమ్మనగామాయశశిరేఖ యిటులనియె.

గీ॥ బలుదుకోపించ నాకేమిభయమటంచు వెడలెకలకంతు లందరు వెంటనడువ చేలమును ముసుకవేసుక బలునికడకు। జొచ్చెసిగ్గున మొగమెత్తి జూడకబల.

వ. ముత్తయిదువలత్యంతముదంబునకల్యాణంబులుబాడ ననేక వాద్యంబులుమ్రోయ బ్రాహ్మణోత్తములు స్వస్తివాచనంబులు చదువుచు నన్వయగోత్రనామంబులుగడ్డింపుచున్న తరికకునికృతవర్మ సైంధవాదిబాంధవులు నిరుగడలనిలువంబడి వధూవరులమధ్యంబున తెరబట్టిరాసమయంబున నీలాంబరుండు లక్షణునకు కన్యాదానంబు గావించె నప్పుడు

లక్షణుని-గీ. సఖియలనుకోర శశిరేఖచక్కదనము. విన్నవాడౌటసంతోషవివశుడగుచు యెవుడు తెరదీతురు విధమో మెవుడుజూతు ననుచు లక్షణుడీలాగు మనమునందు దలచుచున్న,

వ. అంత బ్రాహ్మణులు రెండోరులజూడుండని తెరవంచిన లక్షణుడు చూచి గడగడవణకి యిటులనియె.

లక్ష దరువు అట ముఖారి.

అయ్యయ్యో నన్నిట్లనియ్యాండి యిదిరామొ దయ్యమగపడుచున్నదీ। యిన్యోడశశిరేఖ నెయ్యోవు లేద చయ్యన భయమాయెనది॥ అయ్యయ్యో॥

వ. ఇక్కడ దయ్యము వున్నదిగాని శశిరేఖ లేదు నాయనా.

దు-వ. చక్కనిముద్దుగుమ్మగాని దయ్యముగాదు నిదానించి చూడరా తనయా.

లక్ష దరువు

పెండ్లికూతురుగాదు పండ్లుబెరచుక గండుపిల్లి కనపడుచున్నదీ। పెండ్లివలదయ్యా నాకండ్లకుభ్రమదెచ్చె కరుణించివిడిపింపుడీ॥ అయ్యో॥

ల-వ. భీకరించుకొని గండుపిల్లియున్నది నాయనా.

దు-వ. పిల్లిగాదు మిరుమిట్లనేత్రంబులు గల సుందరాంగిరా తనయా.

లక్ష్మి దరువు.

అల్లదుగో రోమూలభల్లుకముగుపడెపల్లవపాణిగాదూ। మొళ్ళజను లునన్ను కళ్ళుపరతురు చూడ వళ్ళగాకయున్నది॥ అయ్యో॥

వ. రోమారు బెరిగిన భల్లూకముగాని శశిరేఖగాదు నాయనా

దు. వ, సీకుకన్నులుచెదరెనేమో నిదానించిచూడరాతినయా,

లక్ష్మి-దరువు.

పెద్దలందరుగూడి పెండ్లిచేయుటకునై వద్దికతోవస్తిరి। దద్దరిల్లు చులేచి పెద్దపులియదెవచ్చె వద్దొద్దు పెండ్లికనూ॥ అయ్యో॥

వ. పెద్దపులిపైకిదూకుచున్నది నాయనా.

దు-వ, పెద్దపులిగాదు దద్దరిలవద్దు నిదానించిచూడరాతనయా

లక్ష్మి-దరువు

ఇంతి నాకికవలదు బాంతాలింగాహ్వాయుని బ్రోచుశ్రీహరిసాక్షి గా। దంతిపురమునకెళ్ళి చింతలేకనుయేను సంతోషముగబ్రతికేనూ॥

వ. అనిన రాచకొమారు లిట్లనిరి.

గీ. మృగములున్నవటంచు మోము నేలనవంచి దిగులునొందినో రుదెఱచుకొనుచు పండ్లిగిలించుక వడినేలపొరలెదో మహారాజుకొడుకు కిది మగతనంబె.

వ. ఇటులనుచున్నంతలో ఘటోత్కచుండు రాక్షసమాయచే ననేకసర్పవృశ్చికమృగంబుల ప్రయోగింపనందరుభయభ్రాంతులై యుండగా వ్యాఘ్రరూపంబుమాని నిజస్వరూపంబుదాల్చి గగనంబునకెగసి రుధిరపాషాణ మలమూత్రంబులు గురిపించుచు శరపరంపరలు గావింప నందరువెళ్లుచున్న దుర్యోధనునింగాంచి యిటులనియె.

ఘ దరువు ఆది నాట

ఓరోరిదుర్యోధనా నమరమునసీవూ పారివెళ్ళుట తగునా।దూర ముచూడక దొడమగవానిరీతి। మీరివస్తివినిన్ను ధారుణి గూల్తునిదుగో॥ వోరో॥ దొడమేసలునకు బిడనుబలుడియ్యా। నడమొచ్చుటసీకిది చెడతలం పేకదా॥వోరో॥ వరుసతో పాంచాలివలువలిప్పించిన। దురహంకా రుడనిన్ను ద్రుంపకవిడుతున॥ వో॥ జూదములో మంచి సాధూలనోడిం

చి నాదు ముదుముందరయున్న పౌదుర శౌర్యంబె॥ ఓ॥ దండైన పాం డవుల యుండనుండక నీవు। ఖండలు బెంచిన ఖండింపకిరుతువు॥ వో॥ ఒక్క దెబ్బ కొనిను పక్క టెముకల్ విరుగ। ద్రొక్కక విడువను నిక్కమిది నమ్మర॥ ఓ॥ గురుతుగ వటగుంట కృష్ణుడెయగని పెండ్లి త్వరపడి జేయా నీతర మటర పాపిష్టి॥ ఓ॥

వ. అని బాణపరంపరలు గావింప నిల్వంజాలక దుర్యోధనుండు

దు-క. బలరాముడు మముబిలచియు లలనామణినిత్తునని నలతు గుర్రలకున్, బలమునుగూర్చుక వచ్చితి, విలసితముగ కరుణతోనువిడిపింపుమనన్,

వ. ఈవిధంబున ఘటోత్కచునుండు దుర్యోధనాది కురు బలంబులభంగపరచి పురము వెడలించుట నెరింగి బలరాముండు నారాతును నితో నిటులనియె.

ల-ద్వి. వినరోరిరాతుస నినరనీచాత్మ- పనివడిద్వారకాపట్టణంబుచేరి-గొప్పకొంచెంబెందు కొనకీవుసమ్ము-తిప్పలుబెట్టుచు తిరుగులాడెదవు-రాజులనందరి రచ్చలకీడ్చి-యాజిలోదుస్సాసనాదులగులిచి-తివికళునికర్ణుని తీవ్రతతరిమి-భువిలోనప్రఖ్యాతిబొందితినసుచు - సౌభద్రు పక్షమై సకలబాంధవుల-నేభయంబునులేక వెళ్ళదరిమితివి-నీవెన్నిభంగముల్ నిర్ణయించినను-కేవలమభిమన్యుకే నీదుసుతను-వరుగలో లింగాఖ్య వరదుండువచ్చి-నిరతంబు వేడిన నివ్వనుపోరా.

ఘ-కందార్థం॥ నీలాంబర నీపుత్రిక। బాలుం డభిమన్యుకిచ్చి పరిణయమిడకన్। తూలగనాడిననిన్నిక।కూలుతు బాణంబునైచి క్రూరుడా। నీవెరుగవె యిహపరదూరుడా॥ కౌరవయాదవ క్రూరలంబుల। పోరిలోన నేబోనివ్వను వడి॥ క్రూరుడ॥

వ. మేనల్లునకు పిల్లనివ్వక దుర్యోధనుని కొమారునకిచ్చు న్యాయమానా బలరామనృపాలా.

బ-కందార్థం॥ నీవెన్నిమాటలాడిన। నావరసుత నివ్వనింక వరుపుత్రునకున్। కేవలము తరుణునకున్। భూవిభులందరు మెచ్చ యిచ్చెదా। పరిణయముగాంచి మెచ్చెదా॥ కుచితబుద్ధియు నిచ్చదలంచియు వ

చ్చము లేనటుబల్కెపల్కనవే॥ నిచ్చెదా॥

వ. నీవెన్నివిధముల జెప్పినను శశిరేఖను లక్షణునికిచ్చుట నిశ్చయము మీాయభిమన్యునకివ్వను పోరా ఘటోత్కచా.

ఘ-ద్వి. నీలాంబరుండివి నిన్నుపొగడెదరు-చాలగానీలోనీచవు బుద్ధిగలదు-బలభద్రుడను పేర బరగు కేశాని-కులనాశకుండవు గురులుగానీవు-హాలపాణిశౌర్యుడటంచుపొగడెదరు-వలదుక్రూరుడవీవు వాస్తవ్యముగను-అచ్యుతాగ్రజుడివి యందురుగాని-స్వచ్ఛముగనియందు సద్గుణంబేది-ఘట్టిగాగొల్ల మూర్ఖంబుమంచంబు-పట్టెలువిఱుగంగ పడద్రొక్కనుచు-బలుకుటనిజమయ్యె బలుడనీయందు-వెలదినివ్వకపోతె వినుమునాప్రతిన-అరయగగొంత్రె ముచ్చబ్బయదాను-వరదునికృపయున్న వదలను నిమ్మా॥

వ. ఇట్లనేక విధంబుల దూషింపుచు కలహింపుచున్నఘటోత్కచుని శౌర్యంబున కొపంజాలక బలరాముడు దీనుండై శ్రీకృష్ణునకిట్లనియె

బ -. దరువు - ఆది.

ఏమిసేయూదీయెడ। నాకేమిదోచదులెమ్ముడా॥ నేనేమి॥ కామపాలుండ నిదుపేరూ। గలిగియేమిా ఫలమురా॥ యేమి॥ భామినీమణి నిప్పుడా। కురు। భూమిాశుని వరతనయూడూ ప్రేమతో పెండ్లాడుటకు నేనోమునోచగనైతిని॥ యే। దనుజుడెవడో వచ్చెనూ। బల్। నునిసితాస్త్రాలివై చియు। ఘనుడుదుర్యోధనుడు మొదలగుజనుల భువిపైతరిమెనూ॥ యేమి॥ ఎక్కడబలవంతుడో। వాడొక్కడెమనబలముల। వక్కెలుముక లిరుగద్రొక్కి గ్రక్కునసందరినిదరిమెను॥ యేమి॥ పరువు తక్కువాయెనూ। నేబ్రతికియేమిా లాభము। నిరతము వటగుంటపట్టణనిలయ నాకెరిగింపుమూ॥

వ. అనిన కృష్ణుండు నవ్వుచు యిటులనియె.

కృ-గీ. మనకుమేనల్లుడుండగ మనతనూజనివ్వకను కౌరవాత్మజుకివ్వదలచి, నవుడెదుర్దశజెందదే యదువనినాథ, కుచితమిడచియుశ్రీఘటోత్కచునివేడు,

వ. గావున యభిమన్యునకు శశిరేఖను రెయిసంగి వివాహంబుగా

వింతుతా నని ఘటోత్కచునీ సమాధానపరచు మన్నగారయా॥

బ-వ. ఓయితమ్ముడా నీయిష్టప్రకారము నెరవేర్పుము అనిన శ్రీకృష్ణుండు ఘటోత్కచున కిటులనియె.

కృ దరువు రూపకము సావేరి.

భీమాత్మజనీశౌర్యం॥ భీమహివర్ణింపదరమె॥ భీమా॥ మామలపై యలుగుట యవమానం బనిమది నెన్నుము॥ భీ॥ కదనంబున నీప్రజ్ఞయు గాంచితినికచాలింపుము। సుదతి నీయనుజునకును। సుదినంతసమునసౌను గెడ॥ భీ॥ బాలుడనామాటలువిను। చాలగ పటవరపురమును। మేలుగనేబాలించుట। నీలోపల నీవెరుగవె॥ భీ॥

వ. ఘటోత్కచా మాశశిరేఖను మాయభిమన్యున కొసంగెద ము గావున కోపము మానుము.

ఘ-క, మీతనయునుముందుగనే నాతమ్మునకివ్వకున్న నారుణకోపం బీతీరువచ్చిచేసితి। నాతప్పులుగావుమింక పలినదశాక్షా.

వ. అని నమస్కరించినశ్రీకృష్ణుండుసంతసించిసుభద్రాభిమన్యశశిరేఖలున్నవనము జూవుమని బలరామకృష్ణులు వనంబుచేరి సుభద్రతో శ్రీకృష్ణుం డిటులనియె.

కృ-ద్వి. అమ్మనీతోబల్కినటువంటిమాట-లన్నియుమదినుంచి యలుగంగవలదు- నీవుగోరినపద్దునిజముగజెల్లె-గావున కోడలై కమలాక్షినిన్ను-చేరునుపనులెల్ల చేకూడెయికను-నేరంబులెన్నైన నెంచకలే చిరమ్ముపోదాముపురికి రమణినిచ్చెదము - నిమ్మహితప్పని నెంచంగ వలదు-మంచిచుట్టరికమని మదిలోనదలపు-అంచితంబుగ పాడియావుల నిత్తు-కోటిమణులూరహాలు కోట్లునిచ్చెదము-మేటయినదాసీల మెలత కిచ్చెదము - శ్రీమట్రిగుంటపురి జనులుముదమంది - ప్రేమతోగాంతురు పెండ్లివైభవము.

సు దరువు ఆది.

నేరానునేరానయ్యా। ద్వారకాపురికి॥ నేరా॥ దారుణేమీకు సరిగారానిమమ్ములు। దూరానాడితిరవుడు। వేరేయోచనలేల॥ నేరా॥ ఎంతబతిమాలిన కాంతినివ్వనంటిరి। దంతిపురివానుని తనయునకివ్వండి॥ నే

రా॥ మీసుతను త్వరగాను మీరుదోడ్కొనిపోయి భాసురంబుగ మీరుపట్నముచేరండి॥ నే॥ ఇంతకుయోచన లెంతమాత్రము వలదుబొంతా లింగాహ్వయుని బ్రోచిన జగధీశ॥ నేరా॥

గీ. పొట్టకునన్నంబు గట్టబట్టయులేని, యట్టివారికెట్లు పట్టినిత్తు
ననుచుదుర్యోధన తనయుకిచ్చెదమని, యంటి రట్లొనర్పుడన్నగారు

వ. అనిన బలరాముం డిటులినియె.

బ దరువు అట ముఖారి.

నాతప్పులెంచవలదమ్మా। నీవు। నాతోడుసేడగదమ్మా। నా। ఖ్యాతిగదైవము యీతీరునామదికి। నీతి దెలియకుండ నెంచిరియొనర్చెనూ॥ నా॥ వెనుకచింతించుట వెఱ్ఱితపంబని। ఘనులువచించుట వినగలేదటవమ్మా॥ నాత॥ మాటతప్పినయట్టి మహిపతియనిభువిలో। సాటిరిగాబోలు సర్వజనంబులు॥ నాత॥ గరిమెతోబొంతలింగాహ్వయువరదుని। అరిసమయంబుగ నెంచి తపుడింత తెలియక॥ నా॥

వ. ఈవిధంబున బలరామకృష్ణులు సుభద్రాదేవిని చేతులబట్టి లేవదీసి శశిరేఖాభిమన్యులను దోడ్కొని ద్వారకా పురంబుచేరి వివాహమహోత్సవంబుగాంచి రెట్లనిన.

పెండ్లిపాటలు ఆది ఆనందభైరవి.

శ్రీకరముగ నభిమన్యుడూ। యా॥ శశిరేఖనపుడు పెండ్లియాడెనూచాలా। పాకశాసనుడాది బహుసురులుదీవింపగ॥ శ్రీక॥ వేదములు భూమిసురులు చదువగా। వాద్యా। నాదము మించగా। అవుడుమోదములోనేసాలు ముదితలు జల్లగామా॥ శ్రీక॥ కంకణబాషికములు గట్టగా। నిరు। వంకాలపుణ్యస్త్రీలుబాడగా। చాల। పొంకముగ దానములుభూసురులకొసగగ॥ శ్రీక॥ మంగళసూత్రముగట్టింపగా। బాగ। పొంగి వధూవరులు జూచుచుండగా। మేలు లింగయాఖ్యుని బ్రోచు సంగీతలోలుకృపతో॥

క. ఈలాగుపెండ్లిచేసిన వాలాయముగాను పుష్పవర్షమునురలుర్
మేలనిగురిపించిరి భువి లానితముగ బుధులువిప్రు లానందింపర్

మంగళహారతి దరువు ఆదితాళము సురటరాగము.

శరమొప్పదశరథ కౌసల్యాసుతుడవై హరుని ధనువ్వును విరచి యునూ। ధరసుతన్వరియించి పరశురామునిభంగ। వరచిశ్రీసాకేత పురి నేలురామా॥ మంగళం॥ మంగళం రాఘవనీకూ। మంగాళంమంగాళం తపనపుత్రుని జేరి యపుడువాలినిజీరి। కృపతోరవిజునకు కిష్కిందానగరి సపరివారముగా పట్టభిషేకమొనర్చి। నిపుణతరాజ్యా మేలించినరామా మం॥ హనుమంతు మొదలయిన వనచరబలమును। జనకతనయనువెదు కనుబనుపా। దనుజునిలంకా పట్టణమునగనివస్తి। మనినహర్షించిన ఘన రఘువీరా॥ మం॥ బలుశౌర్యమునుమించి జలనిధిబంధించి చలమునరా వణుసంహరించి। పలనొప్ప విభీషణునకు పట్టముగట్టి చెలగిశ్రీజానకినిచే కొన్నరామా। మంగా॥ మక్కువపుష్పకమెక్కియయోధ్యకు। గ్రక్కున జనికొంత కాలమేలి। చక్కగవటగుంట చొక్కముగనుబ్రోవ। నిక్క ముగావసియించిన యినకులరామా। మంగ॥

క, ఈశశిరేఖానాటకమును, భాసురముగవ్రాసిచదివి భక్తితోవినినవా
రాసిగనాయువుసతిసుతు, లీసునిసత్కరుణతోను వెలయుదురిలలో॥

క. అనిమట్రిగుంటగ్రామం, బునపంచమకులుడగోత్రి ముచ్చురంగదా
సునితనయుండబ్బాయదా సునిచే రచియింపనయ్యెనుస్థిరమయ్యె॥

ద్వి. ఈనాటకంబెపుడు నింపుగాచదివి-మానుగావ్రాసిన వారు కవినిన-ఆడినపాడిన నాయువుసిరియు కూడియుపతిసుతుల కూడిసుఖిం చెందాకరవిచంద్రు లెందాకతార-లెందాకవారిధు లెందాకధరణి-యెం దాక వేదంబు లెందాకనుండు-నందాకనీకృతి కాయువుగల్గి-సుందరంబై యొప్పి శుభకరమమరు.

శ్రీమత్పంచమకుల వైష్ణవుండగు గోత్రెముచ్చు
రంగాదాసుని సుతుండగు అబ్బాయిదా
సునిచే రచియింపఁబడిన మట్టి
గుంట శశిరేఖాపరిణయ
నాటకకం-సంపూర్ణము.



నూతన పుస్తకము! మహేంద్రజాలము!

వెల సరసము! ఫలమధికము!

# మహాగారడి — జాలరహస్యము.

హా రేహ్వా! ఈ పుస్తకములోవుండు మహిమ యింతింతయ
చెప్పనలవిగాదు. ఆహా! చోద్యమే చోద్యము దీనిని యింతప్రయాస
మెవరు తెచ్చెదరు అని నామనమున దలచితిని యిప్పుడుయీపుస్తక
ము చూడని జన్మముపుండియేమి లేకయేమి దీనిలోవుండు విద్యలు
మూడు 500 గలవు అందరున్ను విద్యలుచేయడానికి పుస్తములు వే
బుచ్చియున్నారు అంజనములు చేయడానికి వెలిబుచ్చక ఆపుస్తకమ
లనుతీసి మోసముజెందక మా పేరుతో వెలసియున్న పుస్తకమునే తీ
చదివి ఆనందింతురని కోరుచున్నాము.

ఇందులో, అంజనములుచేయుపద్ధతి విశేషముగా గలవు యి
పుస్తకములోనుండుమహిమ చెప్పనలవిగాదు తీం చదివినవారికే తె
నునుగాని మాకంటెవారు ఆపుస్తకమును వర్ణింపనలవిగాదు. యీపు
స్తము మావద్ద విశేషముగా సెలవగుచున్నవని పేరాసగలవరులు వి
విగా అచ్చొత్తించియున్నారు. గాన అట్టిపుస్తకముల తీసి మోసముజె
దక యీక్రిందికనువరచియుంచు అడ్రస్సుకు వ్రాసి తెప్పించిచూచుడ
మాయందుగల సత్యాసత్యములు బోధపడును యీతూరితప్పిన మ
రొకతూరి తీయనలవి కొన్నిప్రతులుమాత్రమే ముద్రించియున్నా
వెనుక చింతించుటవలన లాభము లేదు.

దీనివెల 12 అణాలుమాత్రమే.

యిప్పుడే తెప్పించి చదివిచూడుడు.

వలయువారు;— ౨ ధారాణి అండుకంపెని,

నెం 9 వాకలసందు సౌకారుపేటపోస్టు.

మద్రాసు.